ప్రేమము క్రమక్రమముగ తనయందలి మాధుర్యమును ప్రకాశింపఁజేయుచు స్నేహము, మానము, ప్రణయము, రాగము, అనురాగము, భావము అనురూపములను ధరించుచున్నది.

ఇక్షుదండము క్రమముగ బీజము, ఇక్షురసము, గుడము, ఖండము, శర్కర, సిత అగుచు తుదకు సితోత్పల మగుచున్నది. ఆ రీతిగనే రతియనెడి ఏకవస్తువునకే ప్రేమము, స్నేహము, మానము, ప్రణయము, రాగము, అనురాగము, భావము అను క్రమోన్నతి కలుగుచున్నది.

భావశబ్దముచే మహాభావము కూడ చెప్పఁబడుచున్నది, భక్తుఁడు ఏ జాతి ప్రేమకలిగి యుండునో, కృష్ణునకు ఆజాతిప్రేమయే ఉదయించును.

మధురరసమందు యువకునకును, యువతికిని నడుమ ధ్వంసకారణమున్నను సర్వదా ధ్వంస రహితమగు ఏభావబంధనము కలదో అద్దానికి ప్రేమ యని పేరు.

ప్రౌఢ, మధ్య, మంద భేదములచే ప్రేమ మఱల మూఁడు విధములగుచున్నది.

పరాకాష్ఠ నొందినదగుచు ఏ ప్రేమము చిద్దీపమును ఉజ్జ్వలింపఁజేయఁ గలిగి హృదయమును

స్నేహము

ద్రవీభూత మొనర్చుచున్నదో

ఆ ప్రేమయే స్నేహమనఁబడుచున్నది. ఘృత స్నేహము, మధుస్నేహము అనుచు ఆ స్నేహము రెండు విధములు.

అత్యంతాదరమయమగు స్నేహమే ఘృతస్నేహము. మదీయత్వముచే అతిశయించిన స్నేహమే మధుస్నేహము.

రతికి రెండు విధములగు ఆకృతి కలదు. "నేను వాని దానను" అనుభావనతోఁ గూడుకొన్న రతి ఒకటి. "అతఁడు నావాఁడు" అనుభావనతోఁ గూడుకొన్న రతి ఒకటి. ఘృత స్నేహమందు నేను వానిదానను అనుభావము చంద్రావళికి గలదు. మధుస్నేహమందు అతఁడు నావాఁడు అనుభావము శ్రీరాధికకు గలదు.

మానము

స్నేహోత్కర్షమందు అదాక్షిణ్యము, కౌటిల్యము ప్రకటింపఁబడినప్పుడు అది మానమగుచున్నది. ఉదాత్త, లలితభేదములచే మానము రెండువిధము లగుచున్నది.

ప్రణయము

అభేదమనన రూపమును, విస్రంభ యుక్తమును అగు మానమే ప్రణయమగుచున్నది. ఒకానొకచోట స్నేహమునుండియే ప్రణయము ఉత్పన్నమగుచు మానధర్మమును పొందుచున్నది. ఒకానొకచోట స్నేహమునుండి మానము ఉత్పన్నమగుచు ప్రణయత్వము నొందుచున్నది.

రాగము

ప్రణయముయొక్క ఉత్కర్షావస్థయందు అతిశయమగు దుఃఖముగాని, అతిశయమగు సుఖముగాని లక్షింపఁబడినపుడు అదియే రాగమగుచున్నది. నీలిమా, రక్తిమా భేదములచే రాగము రెండువిధము లగుచున్నది.

స్థాయీమధుర భావమును, ముప్పదిమూఁడు వ్యభిచారీ భావములును, హాసాదులగు ఏడును కలసి నలువదియొక్క భావాంతరములగుచున్నవి.

అనురాగము

ఏ రాగము స్వయం నవనవ భావమునొంది సదా అనుభవనీయమగుచు అనుక్షణము ప్రియునియందు నవనవత్వమే తోఁపించుచుండునో అది అనురాగ మనఁబడుచున్నది.

విప్రలంభము

దీనియందు వశీభావము, ప్రేమవైచిత్ర్యము, ప్రాణరహితములగు పదార్థములలో ఒకదానిగ జన్మింపవలయునను తీవ్ర సంకల్పము లక్షితములగుచుండ ఆ అనురాగము అనంతమగు ఉన్నతి లాభము నొందుచున్నది. మఱియు, విప్రలంభావస్థయందు కృష్ణస్ఫూర్తినే కలిగించుచున్నది.

మహాభావము

విప్రలంభమే ప్రేమవైచిత్ర్యము. యావదాశ్రయ వృత్తిరూపమగుచు అనురాగముస్వయం వేద్యదశనుపొంది ప్రకాశించుచున్నప్పుడు అది భావమనియు, మహాభావ మనియు చెప్పఁబడుచున్నది.

శ్రీ రాధికయందు అనురాగముయొక్క యావదాశ్రయ తత్త్వ పరాకాష్ఠ కలదు.

శ్రీ కృష్ణునియందు మూర్తీభవించిన శృంగారమగుచున్న విషయతత్త్వ పరాకాష్ఠ గలదు.

ఆ అనురాగరూపమగు స్థాయీభావముయొక్క కడపటి స్థితియందు యావదాశ్రయవృత్తి కలుగుచున్నది.

వేద్యదశ, అనఁగా, తత్ప్రియసీజన విశేషముయొక్క సంవేద్యదశ (That self - cognitive state of the particular beloved) ప్రాప్తమగుచు యథావసరముగ సుదీప్తము మున్నగు సాత్త్వికభావముల మూలమున ప్రకాశమానమగుచున్నది.

మహాభావము విషయాశ్రయములను అభిన్నభావముతో ఒకచోటచేర్చి మహాసాత్త్విక వికారములచే ద్రవీభూతములుగ ఒనర్చుచున్నది.

ద్వివిధ మహాభావము.

కృష్ణునియొక్క స్వకీయ రసమందు మహాభావము దుర్లభమగుచున్నది. వ్రజదేవీ గణమునకే యిది సంవేద్యమగుచున్నది.

రూఢము, అధిరూఢము అను భేదములచే మహాభావము రెండు విధములగుచున్నది.

నిమేషమాత్రమగు ఎడఁబాటునైన ఓర్వజాలకుండుట, తాను ఏమగునో అను భయముచే తన చెంతనున్నవారలకు హృదయక్షోభము కల్గించుట, కల్పము క్షణముగఁదోఁచుట, కృష్ణసన్నిధి సౌఖ్యము లభించియున్నను ఆ సౌఖ్యము పోవునను శంకించి ఖిన్నత్వము నొందుట, మోహాదులు లేకున్నను తనను, ఇతరములను కూడ పూర్తిగ మఱచియుండుట, క్షణము కల్పముగఁ దోఁచుట మున్నగు సకల

అనుభావములును సంభోగ విప్రలంభముల యందు యథా క్రమముగ అనుభవనీయము లగుచుండును.

అధిరూఢమందు మోహనము, మాదనము అను రెండు విధములగు భేదము కలదు. మోహనమునుండి దివ్యోన్మాదము కలుగుచున్నది. దానియందు ఉద్ఘూర్ణమును, చిత్ర జల్పాదులును కలుగుచున్నవి. విప్రలంభమందు ఈ రెండు భావములు ఉదయించుచున్నవి.

ప్రజల్పము, పరిజల్పితము, విజల్పము, ఉజ్జల్పము, సంజల్పము, అవజల్పము, అభిజల్పము, ఆజల్పము, ప్రతి జల్పము, సుజల్పము అనెడి భేదములచే చిత్రజల్పము దశవిధ ములగు అంగములు కలదగుచున్నది (భ్రమరగీత).

హ్లాదినీసారప్రేమము సర్వభావప్రకటన మూలమున ఎప్పుడు ఉల్లాసయుక్తమగుచున్నదో, అప్పుడు ఆప్రేమము పరాత్పర భావరూపము వహించి మాదనము అను నామ ముతో శ్రీరాధికయందు నిత్యవర్తమానమైయుండును.

కృష్ణుఁడే రసము.

కృష్ణుఁడే రసము. అతఁడు అనంతుఁడును, సర్వజ్ఞుఁడును, సర్వశక్తిమంతుఁడును అగుచున్నాఁడు. అతనికి గోచరింపనిదియును, అతనిచే పొందఁబడనిదియును, అతఁడు కూర్పఁజాలనిది యును కొంచెమైనను లేదు.

అతఁడు అచింత్యభేదాభేదధర్మము కలిగినవాఁడగుటచే యుగపద్ధర్మమున ఏక రసమయుఁడును, బహురసమయుఁడును అగుచున్నాఁడు. ఏకరసమయుఁడగుచు అతఁడు సమస్తమును

ఆత్మవశ మొనర్చుకొని ఆత్మారాముఁడగుచున్నాఁడు. అప్పుడు వానికంటె భిన్నముగ ఎద్దియు రసరూపము వహించి యుండఁజాలదు.

మఱల అతఁడు బహురసమయుఁ డగుచున్నాఁడు. కనుక ఆత్మగత రస వ్యతీతమగు ఆ అవస్థయందలి పరగత రసము ఆత్మగత రసముతోఁగూడి విచిత్రరసము అగుచున్నది.

ఈ రెండు విధములగు రసములయొక్క అనుభవమందే కృష్ణుని లీలాసుఖము సంపాదితమగుచున్నది. బృందావనమందు ఈ చరమ విస్తృతి మిగుల ప్రస్ఫుటమై యుండును. కావున ఆత్మగతరసముచే తెలియఁబడని పరమ సుఖముతోఁ గూడుకొన్న పారకీయ రసమే మాదనసీమ అగుచున్నది.

ఇది అప్రకటలీలయందు విశుద్ధరూపముతో గోలోకమున నిత్యవర్తమానముగనుండును. భౌమవ్రజమునకు ఇది అవతరించినపుడు కొంచెము మాయతోఁ గలసియుండినటులు గోచరించుచుండును.

సోపానములు

ప్రేమారురుక్షువులగు ఓ సాధక భక్తులారా! మీ వైధభక్తి మూలమున భావమార్గమును పొంది మీరు ఈచతుర్దశ భువనాత్మకమగు ఈ బ్రహ్మాండమును గడచిపోఁగలిగితిరి. ఈ పదునాలుగు భువనములకు పైభాగమందున్న లింగ జగద్రూపమగు ఘారధామముయొక్క నాలుగు స్థర (Plane) విశేషములను దాటి ఊర్ధ్వగాములు కండు.

విరజారూపమును, విశుద్ధసత్త్వమయమును అగు స్థర ద్వయమును భేదించితిరేని గోలోక బృందావనసీమాలాభము మీకు అబ్బును. ఈ రెండు స్థరములకు బ్రహ్మధామమనియు, వైకుంఠమనియు పేళ్లు.

గోలోకమందు ఆత్మభావమయములగు ఐదు ప్రకోష్ఠ ములు దేదీప్యమానములగుచుండును. శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, మధుర ప్రకోష్ఠములనుచు వానికిపేళ్లు. మధుర మండలముచేరి శ్రీ గోపీదేహరూపమగు నిజనిత్యసిద్ధ చిన్మయ దేహమును అవలంబించి శ్రీమతియగు రాధికయొక్క యూధమున శ్రీమతి లలితాంగణమందు ప్రవేశించి శ్రీరూప మంజరి కృపచే తమ హృదయమందు శుద్ధచిన్మయములగు విభావ, సాత్త్విక, వ్యభిచారీ భావములచే తమస్థాయీ భావ మునకు రసావస్థ కల్పించుచు తన్మూలమున దానికి ఉన్నతి లాభము కలిగింతురుగాక.

నామముచే ఆకర్షింపఁబడిన రసజ్ఞులైనచో అనాయా సముగ మహాభావ పర్యంతమగు ప్రేమధనమును ఆర్జించి మీరు కృతార్థులు కాఁగలరు మీకు ఇపుడు కలిగియున్న అధికారమును గూర్చిన విచారము సల్పుటచేతను, జడదేహ మందు యుక్తవైరాగ్యము కలిగి యుండుటచేతను, మఱియు. నిరంతరము నామరసపాన మొనర్చుటచేతను, సర్వోత్తమాధి కార లాభము నొందుఁడు.

ఈ మధురరస విచారమునకు సంబంధించి నేను ఇంత కంటె అధికములగు ప్రమాణములను సంగ్రహింపలేదు.

ఏమన, ఎవరికి ఈ రసమందు ప్రవేశించుటకు అధికారము కలదో, అట్టివారలకు ఈ రస సంబంధమగు యావద్విషయము "శ్రీ ఉజ్జ్వల నీలమణి" గ్రంథమందును, "జైవధర్మ" గ్రంథమందును లభింపఁగలదు.

రసముయొక్క సమస్త విచారము అవగతమగుచుండ అష్టకాలీయమగు నిత్యకృష్ణలీలయందు ప్రవేశించి నిజాధికారమునకు అనురూపములగు క్రియలును, సేవయు, భావమును అవలంబించినచో అనాయాసముగ వస్తుసిద్ధి కలుగును. యుక్తవైరాగ్యము కలిగినంతనే సహజ పరమహంస ధర్మము తనంతటతానే జీవన శేషమందు ఉదయించుచున్నది.

మధురలీలా ప్రవేశమునకు అధికారము.

స్థూలదేహగతము సుఖమునందు ఆసక్తులగుటచే ఎవరికి చిన్మయదేహగతమగు ఈ సకలానంద వైచిత్ర్యము అవగతము కాకుండునో, అట్టివారలకు ఈ రసమునందు దృష్టి యిడుటకుగాని, దీనిని స్మరించుటకుగాని, విమర్శించుటకుగాని ఎంతమాత్రము అధికారములేదు.

ఏమన, వారు అట్లు చేసినచో ఈ సకల వర్ణనము మాంసచర్మగత క్రియలకు సంబంధించినదిగ భావించి, అది అశ్లీలమనుచు నిందింపనైన నిందింతురు. లేదా, తద్వర్ణనమందు ఆదరము కలిగి సహజీయ (Psilanthropist) భావము నొంది అధఃపతితులైన నగుదురు.

దీని సిద్ధాంత మేమన, ఇపుడు నేను ఏరసముగూర్చి విచారణ చేయుచున్నానో, ఆ రసము అనాదియు, అనంతము

నిత్యము

అగుచున్నది. ఏ స్థాయీభావములును, విభావములును, అనుభావములును, సాత్త్విక భావములును, సంచారీ భావములును ఆ రసమునకు సామగ్రీ విశేషము లగుచున్నవో అవి అన్నియు నిత్యములు. వాని యొక్క యోజనము (కూర్పు) కూడ నిత్యమే. చిద్వస్తు వెచట నిత్యవర్తమాన మగుచున్నదో, రసముకూడ అచటనే వర్తించుచుండును. చిత్స్వరూపముగల భగవంతుఁడును, జీవుఁడును, వైకుంఠమును, ఎట్లు నిత్యపదార్థములో, రసముకూడ అట్లే నిత్యపదార్థ మగుచున్నది. కావుననే ఉపనిషత్తు ఇట్లనుచున్నది.

“ ఆ పరమ వస్తువు రస స్వరూపము కలది. జీవుఁడు రసలాభము నొంది ఆనందించుచున్నాఁడు. ”

ప్రేమలాభమునొంది జీవుఁడు ఏ రసము ననుభవించు చున్నాఁడో, ఆ రసము ప్రేమతత్త్వముతోఁగూడి నిత్యావస్థితి నొందుచున్నది. ఇట్లయ్యును, అది కొందఱు జీవులయందు మాత్రమే ఉదయలాభము నొందుచున్నది. భగవంతునితో జీవునికిఁగల నిత్యసంబంధ ప్రకటనమే రసోదయము.

సామాన్యులగు ఆలంకారికులందఱు ఒకానొక రసము గూర్చి ముచ్చటించిరి కదా అది యే రసము? అది జడ

జడ రసము

రసము. జీవుఁడు జడబద్ధుఁడగుచు ఏ లింగ దేహము నొందుచున్నాఁడో, దాని యందు

అహంకారము, బుద్ధి, చిత్తము, మనస్సు అను వేఱు వేఱు తత్త్వములు చూపట్టుచున్నవి. అహంకారబలముచే మొదటఁ దన నొక జడ సంబంధ పురుషునిగనో, స్త్రీనిగనో చెప్పుకొనుచు బుద్ధి మూలమునఁ దనయొక్క హితాహిత చింత నొనర్చును. చిత్తముచే సుఖదుఃఖభావన మొనర్చుచుండును. మనస్సుచే విషయములను తెలిసికొనుచు విషయధ్యానము చేయుచుండును. ఈ నాలుగు తత్త్వములను జీవుఁడు జడ బద్ధుఁడైన వెనుకఁ గ్రొత్తగ సంగ్రహించెనా? లేక లింగ శరీరమందు వీని కన్నిఁటికి ఒక శుద్ధ బీజముండనే ఉండెనా?

దీని కుత్తర మేమనిన, ఇవి యెంతమాత్రమును నూతన తత్త్వములుకావు. చిత్స్వరూపుఁడగు జీవునకుఁ దన ప్రవృత్తి ననుసరించి తాను ఈ లక్షణములు గల భగవద్దాసుఁడనని చెప్పుకొనునట్టి శుద్ధాభిమాన మొకటి కలదు. ఆ అభిమానము జీవుని చిద్గత శుద్ధాహంకార రూపము నొంది అతని చిత్స్వరూపమునే ఆశ్రయించియుండెను. ఆ చిత్స్వరూపము నాశ్రయించియే హితాహితములను విచారించు బుద్ధియు కలదు. చిత్స్వరూపము నాశ్రయించియే ఆనందోపలబ్ధిస్థాన రూపమగు శుద్ధ బుద్ధియు కలదు. అన్యపదార్థములను, అన్యజీవులను, మఱియు పరమ పురుషుఁడగు భగవానునికూడఁ దనకు విషయములుగ నెఱింగి వాని సంబంధములగు జ్ఞానధ్యానములకు ఉపయోగించు మనస్సుకూడ కలదు.

చిద్గతములగు ఈ వృత్తులన్నియు జడ బద్ధములై జడ సంగ్రమమున లింగరూపముగను, మఱియు స్థూలరూపము

గను పరిణామము నొందుటచే, ఆయా విషయరూపములగు జడీయములు, అశుద్ధములు అగు సకలవృత్తులును ప్రకాశితములగుచున్నవి. కావున ఏ రసము చిద్వస్తువు నాశ్రయించి భావమను పేరితో వ్యవహరింపఁబడుచున్నదో, ఆలంకారికులు విచారించు రసము ఆ రసముయొక్క అశుద్ధ ప్రతిమూర్తియే అగుచు వికృత భావరూపము వహించుచున్నది.

రసమునన దొక్కటే చిద్వస్తువు. నిత్యావస్థ యందది నిత్యానంద స్వరూపము తోడను, జడబద్ధావస్థయందు జడానంద స్వరూపము, లేక, జడ దుఃఖ స్వరూపము తోడను ప్రకాశించుచుండును. కావుననే ఆలంకారికుల యొక్క నామసంబంధ వ్యవహార ప్రక్రియా ఫలములలో ఏవేవి జడరసమునందు లక్షితము లగుచున్నవో, అవి యన్నియు చిద్రసమందు శుద్ధరూపమున నుండును.

జడరసమందు ప్రకృతి భేదమే గ్రహింపనగును గాని ప్రకార భేదము గ్రహింపరాదు. చిద్రసము నిత్యమైనది; జడరసము అనిత్యమైనది. చిద్రసము ఉపాదేయవస్తువు; జడరసము హేయవస్తువు. చిద్రసమందు విషయాశ్రయములు భగవంతుఁడును, శుద్ధజీవుఁడును అగుచున్నారు. జడరసమందు విషయము జడదేహగతమగు హేయ సౌందర్యమును, ఆశ్రయము జడలింగమయమగు చిత్తమును అగుచున్నవి. చిద్రసముయొక్క స్వరూపమానందమును, జడరసముయొక్క స్వరూపము సుఖదుఃఖములును అగుచున్నవి.

జడరసమునకును, చిద్రసమునకును ప్రకృతి భేదము మాత్రము కలదు.

రస నిరూపణము చేయుటకు వాక్యముల లక్షణావృత్తి నాశ్రయించుట సరికాదు. అభిధావృత్తిచేతనే రస నిరూపణ కార్యము సుసంపన్న మగుచున్నది. అట్లు కానియెడల శ్రీ మద్భాగవత గ్రంథము పరమరసమును సాకల్యముగ కృష్ణ లీలారూపమున వర్ణింపఁగలిగి యుండదు. నాయికా నాయకులయొక్క శృంగారపద్ధతి యందును, పితా పుత్రుల యొక్క సాంసారిక వ్యవహారమందును, సఖులయొక్క పరస్పరాచరణమందును, మఱియు ప్రభుదాసుల పరస్పర కార్యములందును, వికృతరూపమగు ఈ జగత్తున పరమ రసముయొక్క అశుద్ధ ప్రతికృతిరూపమును, ఆలంకారికులచే విచారితమును. అగుచున్న రసముయొక్క వికృతభావము స్పష్టీకృత మగుచు తన్మూలమున ఆ రసము తనయొక్క సమస్త లక్షణములను, ప్రయోజనీయోపకరణములను, కార్య విధి సమూహమును, ప్రక్రియా కలాపమును బద్ధజీవునకు చూపించుచున్నది.

స్వప్రకాశమగు వస్తువు తనంతట తానే ఒరులకొఱకు ప్రకాశింపవలెను గాని దాని నెవరు ప్రకాశింపఁజేయఁగలరు? పరమానంద తత్త్వము వికృత మయినప్పటికిని తనయొక్క స్వరూప, గుణ, లక్షణ సముదయమును ప్రకాశింపఁజేయు చున్నది. కావున, అభిధావృత్తి మూలమున రసవర్ణనము చేయుట ఏమియు కష్టములేదు. ఈ జడరస వర్ణనము విని తమయందు చిద్రసోదయము కలుగవలెనని కోరువారు తమ ప్రక్రియా కలాపమందు జడరస సంబంధమగు హేయత్వ సముదాయ మెంతమాత్రమును ప్రవేశింపఁ గూడదను విష

యము మాత్రము జ్ఞప్తియం దుంచుకొనవలసి యుండును. ఏవేవో కొన్ని ఉప సంప్రదాయములయందు చిద్రసమును పుట్టించు మిషతో జడరసము నాశ్రయించుట కలదు. అది అత్యంత దూష్యమగు తప్పుడు మార్గము. అట్లొనర్చుటచే జీవునకు మాటిమాటికి పతనమే కలుగుచున్నది.

జీవుని సిద్ధదేహమందే రసోద్భావన మొనర్చుట కర్తవ్యము. ఏవిధముచేతగూడ ఈ జడ బద్ధదేహమందు రససంబంధ ముదయింపనేరదు. శృంగార రసోద్భావనము కొఱకు కొన్ని సంప్రదాయముల వారు జేయు స్త్రీ స్సాంగత్యమును, తత్సంబంధము లగు సకలచేష్టలును, వారల దౌర్భాగ్యస్థితినే వెల్లడించు చున్నవి. ఏ పని చేయఁగూడదో, ఆ పనియే వారలు చేయుచున్నారు. కనుక తుదకు అధఃపతన రూపఫలమునే వారు పొందుచున్నారు. రససాధకులు ఈ విషయమందు విశేష జాగరూకతతో నుండవలెను. ఇంద్రియ ప్రియులగు ధర్మధ్వజుల దుస్సలహాలను వారెన్నఁడును వినరాదు.

సిద్ధదేహమందు రసోద్భావనము చేయుట కర్తవ్యము.

ఇతర విషయములందు వైరాగ్యము కలిగిన జాత ప్రేమ వ్యక్తులే రసాధికారులు. శుద్ధరతియు, జడవైరాగ్య లాభమును కలుగని వారు చేయునట్టి రసాధికార సంబంధములగు చేష్టలు విఫల చేష్టలగుటయే కాక వారలు రససాధకములని చెప్పుచు నింద్యములగు ప్రవర్తనముల నవలంబింతురు. జాత ప్రేమ

రసాధికారి యెవరు ?

పురుషులకు సహజముగ ఏ భావము కలుగుచున్నదో, అదియే రసము.

రసవిచారమనఁగా, ఆ రసమందుగల ఏ ఏ భావములు ఏయే విధముగ కూర్పఁబడుచున్నవో, అద్దాని వివరణము మాత్రమే యని తెలియవలెను. రసమెంత మాత్రమును సాధనాంగముకాదు. కావున ఎవరైనను, "రారమ్మ. నీకు రససాధన శిక్ష నొసంగుదు"నని పలికినచో అది అతని ధూర్తతనుగాని, మూర్ఖతనుగాని ప్రకటించు వాక్యమే అగుచున్నది.

రసరూపమగు వ్యాపారమందు క్రిందవివరించిన ఐదగు వేఱు వేఱు భావములు చూడఁబడుచున్నవి :-

పంచ భావములు — (1) స్థాయీభావము (2) విభావము (3) అనుభావము (4) సాత్త్వికభావము (5) సంచారీ, లేక, వ్యభిచారీభావము.

స్థాయీభావమే రసమునకు మూలము. విభావము రసమునకు హేతువు. అనుభావము రససంబంధమగు కార్యము. సాత్త్వికభావము రసకార్యవిశేషము. సంచారీ, లేక వ్యభిచారీ భావములు రసమునకు సైదోడులు.

విభావ, అనుభావ, సాత్త్విక వ్యభిచారీభావములు స్థాయీభావమును స్వాద్యత్వావస్థకు తీసికొనివచ్చి దానికి రసావస్థ కలిగించుచున్నవి. వీని వివరణము కలచోట ఈవిషయము లెస్సగఁ దెలియఁబడుచున్నది. కాని సాధకున కెంతవఱకు రసాస్వాదనము లేకుండునో, అంతవఱకు ఈ విషయము ఆత్మగతము కాఁజాలదు.

రసము కేవలము ఆస్వాదన విషయము కాని, తెలిసి కొనుటకగు విషయముకాదు. జ్ఞానముయొక్క ప్రాథమిక వ్యాపారములగు జిజ్ఞాసా సంగ్రహములు అను రెండును పూర్తియైన కాని జ్ఞానముయొక్క చరమ వ్యాపారమగు ఆస్వాదనము సంభవింపనేరదు. మనము సాధారణముగ దేనిని జ్ఞానమని అందుమో అది జిజ్ఞాసకాని, లేక సంగ్రహముకాని అగుచున్నది; అది ఆస్వాదనము మాత్రము కాదు. ఆస్వాదనముచేతతప్ప వేఱొక విధముగ రసమునకు స్ఫూర్తి కలుగదు.

రసము ఆస్వాదన విషయము

మొదట స్థాయీభావమును విచారింపుదము. ఇతరములగు అన్ని భావములను తనవశమందు ఉంచుకొని ఏభావము కర్తృత్వము వహించుచున్నదో అదియే స్థాయీభావము. జాత భావపురుషునియందు ఏ రతి గోచరించుచున్నదో అదియే కృష్ణునియందలి అనన్య మమతతోఁ గూడుకొనిన దగుచు క్రమక్రమముగ ఒకింత గాఢమైనచో రసోపయోగమగు స్థాయీభావము కాఁగలుగుచున్నది. ఆరతి తనకు నిర్దిష్టమగు సీమను, అనఁగా, తన అవిమిశ్రమమగు ఏక భావత్వమును అతిక్రమించి ప్రేమాగారమందు అడుగుపెట్టినను దానిని రతి యని మాత్రమే చెప్పవలెను. ఏమన, ప్రేమ సర్వావస్థలయందును, అసీమత్వము కలదగుటచే రత్యవస్థయందు అది తెలియఁబడునది కాదు. ఒకానొక అవస్థయందు ప్రేమరస పరాకాష్ఠనే తనయందిమిడ్చికొని తెలియఁబడిన

స్థాయీ భావము

దగుచున్నది. కావున స్థాయీభావమనఁగా రతి ముందంజ వేయుటయే.

జాతరతిపురుషులు సాధకులే కానీ, సిద్ధులే కానీ, అందఱును రసాస్వాదనమందు అధికారులే. ఇచట సాధకశబ్ద ముపయోగించుటకు తాత్పర్యమేమనగా, ఎవనియందు రతి పొడసూపియు, దానికి విఘ్నపరిసమాప్తి కలుగలేదో అతఁడు ప్రేమపదార్థ సాధకపదవాచ్యుఁడు, లేక ప్రేమారురుక్షువు అగుచున్నాఁడు. అతనికి నిష్ఠయు, రుచియు, ఆసక్తియు జన్మించినంతనే క్రమముగ అనర్థములు నశించుచున్నవి. ఆసక్తిగతుఁడైనను లింగదేహమున్నంతవఱకు అతనికి జడసాన్నిధ్యము కలిగియే యుండును.

కృష్ణకృపచే అదియు అతిశీఘ్రముగ సమాప్తియగును. ఈ జడసాన్నిధ్యమునకే విఘ్నమని పేరు. విఘ్నము ఎంత వఱకు ఉండునో, అంతవఱకు జీవునకు వస్తుసిద్ధి కలుగదు. కాని ప్రేమదశను పొందిన రతి కలిగినంతనే రసలాభమునకు యోగ్యుఁడగుచున్నాఁడు. మఱియు, అందువలన స్వరూపసిద్ధి అతనికి ఉదయించుచున్నది.

స్థాయీభావమను పేరుగల ప్రౌఢరతి విభావ, అనుభావ, సాత్త్విక, వ్యభిచారీ భావములు అను నాల్గింటిచే స్వాద్యత్వావస్థకు క్రమముగ తేఁబడి విభావముయొక్క పంచ ప్రకార స్వభావ భేదముచే వేఱువేఱగు పంచవిధ స్వభావము నది పొందుచున్నది.

పంచవిధ స్వభావము.

ఆ ఐదువిధములు ఏవి అనిన:—

(1) శాంత స్వభావము (2) దాస్యస్వభావము (3) సఖ్య స్వభావము (4) వాత్సల్య స్వభావము (5) మధురస్వభావము.

ఈ ఐదు విధములగు స్వభావములు మొదట విభావమందు కలవు. విషయాశ్రయముల నడుమనే రతి కార్యాచరణ మొనరించుచుండును. ఈ విషయాశ్రయములే విభాగములుగాగల ఆలంబనకు అంతర్గతములగు పై స్వభావములైదును విషయాశ్రయ సంబంధములైనవి. తన సంబంధమగు ఆస్వాదన రూపరసక్రియయందు రతి విషయాశ్రయ స్వభావము వహించుచున్నది.

విశేష (విలాస) మను పేరుగల భగవంతునియొక్క అచింత్యశక్తి విక్రమముచే ఈ ఐదు స్వభావములును విషయాశ్రయగతములగుచు రసవిచిత్రతను కలిగించుచున్నవి. ఈ పంచవిధ స్వభావమును వహించుటచే రతి పంచవిధములగుచున్నది.

ఎట్లన, (1) శాంతరతి (2) దాస్యరతి, లేక ప్రీతరతి (3) సఖ్యరతి, లేక ప్రేయరతి (4) వాత్సల్యరతి, లేక అనుకంపారతి (5) మధురరతి, లేక, కాంతరతి.

విభావముయొక్క స్వభావము ననుసరించి రతి పంచవిధములగుచున్నది. రసక్రియయందు విభావము ప్రధాన సామగ్రి, లేక, ముఖ్యసామగ్రి అగుచున్నది. ఈ కారణముచేతనే ఈఐదు విధములగు రతియే ముఖ్యరతిగా చెప్పఁబడు

విధములగు రసములలో ఒక్కొక్క రసమునందు ప్రత్యేక ప్రత్యేకముగ స్థాయీభావ, విభావ, అనుభావ, సంచారీ భావములయొక్క సమ్మిశ్రక్రియాగతాస్వాదనము చూడఁబడు చున్నది. జడరసవేత్తలగు ఆలంకారిక పండితులు వీనినే రసములని చెప్పుచు ముఖ్యరూపమున వర్ణించుచుందురు.

కాని ఈరసములన్నియు చిత్తత్వమందు గౌణరూపము ననే ఒప్పుచుండును. ఇవన్నియు జడతత్త్వమందు స్వాభావ సిద్ధముగ ముఖ్యరసములే అగుచున్నవి. శ్రీ "భక్తిరసామృత సింధు" ననెడి గ్రంథమున దక్షిణోత్తర విభాగములందు వాని యొక్కస్థితియు, క్రియలును చక్కగ విచారింపఁబడినవి. ఇప్పుడు జెప్పిన ఏడు విధములగు గౌణ రసములును కృష్ణ భక్తిరసమందు ఉపాదేయములే అగుచున్నవి. ఏమన, అవి శ్రీకృష్ణ లీలారసమునకు పుష్టికారకము లగుచున్నవి. హాస్యాదులగు ఏడు రసములును కృష్ణభక్తి రసమందు వ్యభి చారీభావము, లనఁగా, సంచారీ భావముల నడుమనే పరిగ ణింపఁబడుచున్నవి. ఆ రసములు ఉపయుక్త కాలములం దుద యించుచు రస సముద్రమునందు అలలువలె నొప్పుచు ఆ సముద్రమునకు సౌందర్యమును, పుష్టియు కలిగించు చున్నవి.

రసతత్త్వమునకు సంబంధించిన అప్రాకృత తత్త్వాను సంధానము చేయుటకు సమర్థతలేని కొందఱు సంశయించున దేమన, హాసము, విస్మయము, ఉత్సాహము అనునవి మంగళ మయమగుకృష్ణభక్తిరసమందు అంతర్గతములుగనుండిన ఉండ

గలవు గాని శోకము, క్రోధము, భయము, జుగుప్స అనునవి ఏవిధముగ అమృత, అశోక, అభయ, అక్షోభ స్వరూపములు గల ఆ రసమునందు స్థితి లాభము నొందఁగలవు? అని. లేక, ఈనాల్గింటికి స్థానమిడుటచే రసము ప్రాకృతముగాని, జడ మాయముగాని అగుచున్నదా? అనెడి ఆశంకకూడ కలుగుచున్నది.

దీని కుత్తరమేమనిన, పరమానందమయమగు రసతత్త్వమందు వైచిత్ర్యము తోఁచుచున్నను రస సంబంధము లగు సమస్త వ్యాపారములును ఆనందమూలకములుగాని జడ దుఃఖ మూలకములు కావు. జడ జగత్తునందు నింద్యములుగ భావింపఁబడుచున్న శోకము, క్రోధము, భయము, జుగుప్స అనునవి ఎచ్చటనుండి వచ్చినవి?

రసతత్త్వమందలి వైచిత్ర్యము ఆనందమూలకము.

జడజగత్తునకు స్వతంత్ర సత్త లేనే లేదు. ఇది చిజ్జగత్తు యొక్క హేయ ప్రతిఫలనమాత్రమే. మాతృకయందు శుద్ధములుగను, శివ స్వరూపములుగను ఒప్పుచున్న సంస్థానములు, భావములు, ప్రక్రియలు అన్నియు అమంగళరూపమున ఈ జగత్తునందు ప్రతిఫలించినవి. ఏ యే ధర్మములు అచట ఆశ్రయరూపముః లగుచు నిత్యమంగళ మొనఁగూర్చుచున్నవో, ఆయా ధర్మములయొక్క ప్రతిఫలనములే యిచట పుణ్యములని చెప్పఁబడుచున్నవి. ఏ యే ధర్మములు అచట వ్యతిరేక విధమున మంగళకారకములగు చున్నవో,

జడజగత్తు చిద్ధామముయొక్క హేయ ప్రతిఫలనము.

అయా ధర్మములే ప్రతిబింబితములగుచు నిచట అమంగళ ప్రదములై పాపములుగఁ జెప్పఁబడుచున్నవి.

భయశోకములు ఆజగత్తునందు కృష్ణసంబంధము కల వగుటచే అతి శీఘ్రముగ అనిర్వచనీయమంగళ మొనఁ గూర్చి ఆనందరూపమగు త్వదసమునకు పుష్టియే కలిగించు చున్నవి. ఆభయమే ఈ జగత్తునందు ప్రతిఫలించి జీవునకు ముందు కలుగఁబోవు అమంగళములనే సూచించుచున్నది.

తాత్పర్యమేమనిన, అచటి సమస్త ధర్మములకు నిత్యానంద స్వరూపుఁడగు శ్రీ కృష్ణుఁడే ఏకమాత్ర అవ సాన నిలయము. ఆ ధర్మములయొక్క ప్రతి ఫలనరూపము లగు సకల భావములకు ఇచట ఇంద్రియతృప్తియే అవసాన భూమి ఇచ్చటి అవసాన భూమి అమంగళ ప్రసవమును, అనిత్యమును. కావున, ఆ చిజ్జగత్తునందు ఏవేవి వ్యతిరేక భావమున సుఖపుష్టి కలిగించుచున్నవో, అట్టివాని ప్రతిఫలిత తత్త్వములు ఇచట సాక్షాద్దుఃఖమునే కలిగించుచుండును. కాని యెవరి హృదయములందు చిత్సుఖము యొక్క స్వరూ పానుభవము సాక్షాత్కారావస్థ యందున్నదో, వారు దీని తాత్ప ర్యమును శీఘ్రముగఁ దెలిసికొనఁజాలరు.

నేను ఈ గౌణరసము గూర్చి అధికవిచారము జేయఁ దలఁచు కొనసందున ఈ విషయము నింతటితో ముగించు చున్నాను. ఇఁక ముఖ్యరస విషయమే విచారింపఁబడును.

జీవుని శుద్ధరతి చాలకాలము ఆశ్రయముతోపాటు జడీయమగు కుంఠత్వమును, మఱియు విస్మృతిని భోగించి

అనర్థములు ఉపశమిల్లుచుండ,

శాంతరతి — "ఆహా! ఎంతటి భయంకరమగు ఆపదనుండి ఉద్ధరింప బడితిని!" అనుచు తనయొక్క సహజ శుద్ధావస్థయందు మరల విశ్రామ లాభము నొందును. అపుడు దానికి శాంతిరూపమగు ఒక ఆశ్రయగత భావముయొక్క స్పర్శకలుగుటచే రతి యిప్పుడు శాంతరతి యగుచున్నది.

రతి యందు అనన్యమమత చేరినచో దాస్యరతి, లేక ప్రీతరతి అగుచున్నది. అపుడు భగవంతుని తన ప్రభువుగ

దాస్యరతి — భావించి జీవుఁడు భగవంతుని నిత్య దాసునిగఁదన్నుగూర్చి చెప్పుకొనుచు అట్టి సంబంధమునే వానితో సంస్థా పించుకొనుచున్నాడు.

సంభ్రమగతము, గౌరవగతము అనుచు దాస్యరతి రెండు విధములు. సంభ్రమగత దాస్యమందు జీవుఁడు తన్నా

సంభ్రమగత దాస్యము. గౌరవగత దాస్యము. — అనుగ్రహింపఁబడిన వానిగ భావించు కొనును. గౌరవగత దాస్యమందు (భగవంతునియొక్క) లాలన పాల నములు పొందినవానిగ దనను గూర్చి భావించుకొనును.

సేవకులు సంభ్రమగత దాస్యమునకే ఆశ్రయులగు చున్నారు. పుత్రులు గౌరవగత దాస్యమునకు ఆశ్రయులు. దాస్యగత రసమందు స్థాయీభావమగు ప్రేమము, అనఁగా, రతి, మమతారూపమున పుష్టినొంది ప్రేమ అగుచున్నది.

కాశున దాస్యమందు రతి రూపమును, ప్రేమరూపమును అగు రెండు లక్షణములతోఁ గూడుకొనిన స్థాయీభావము కలదు. దానియందు స్నేహ రాగములు స్వల్పమాత్రములుగ గోచరించుచుండును.

సఖ్యభక్తి, లేక ప్రేమభక్తి రసమందలి స్థాయీభావము ప్రణయము. రతియు, ప్రేమయు దానియందు నిహితములై యుండును. దాస్యరసమందుగల సంభ్రమగౌరవములు పరిపాకావస్థనొంది సఖ్యరసమందు విస్రంభము, అనగా వినిశ్చలమగు విశ్వాసమగుచున్నవి. ఈ రసమందు రతియు, ప్రేమయు, ప్రణయము గాఢతరములుగ నుండును. స్నేహము, రాగము అనునవి స్వల్పమాత్రములుగ గోచరించుచుండును.

సఖ్యరతి.

వాత్సల్య రసమందు ఈ విస్రంభము పరిపాకావస్థనొంది అనుకంప అగుచున్నది. దానియందు రతి, ప్రేమము, ప్రణయము, స్నేహ పర్యంతము బలవత్తరములుగ నుండును. రాగము కూడ దానియందు కలదు.

వాత్సల్యరతి.

శృంగార రసమం,దనఁగా, మధురభక్తిరసమందు కమనీయత్వము ప్రబలమగుచు సంభ్రమ, గౌరవ, విస్రంభ, అనుకంపలను తనయందు పర్యవసితములగునట్లు చేయఁగలిగి యుండును. దీనికి స్థాయీ భావమగు ప్రియత్వము అను పేరుగల రతి

మధురరతి.

ప్రేమ, ప్రణయ, స్నేహ, రాగ, పర్యంతములగు భావములచే పుష్టిలాభము నొందుచున్నది. భావము, మహాభావము కూడ దీనియం దుదయించును.

జీవునకు ఏ రూపమగు వాసన సాధనకాలమందు కలిగి యుండునో దాని ననుసరించియే వాని రతి యొప్పుచుండును. స్వార్థ పరార్థ భేదములు, సామాన్య, స్వచ్ఛా, శాంతి భేదములు, కేవలా, సంకులా, భేదములు మున్నగు ఏ సకల భేదములు రతికి సంబంధించి విచారితములగుచున్నవో, అవి యిచ్చట అధికముగ నిరూపింపఁబడవు. ఈ గ్రంథమునందు అన్ని (రస) విషయములను గూర్చిన విచారము చేయఁబడునని యూహింపరాదు. కేవల స్థూలవిషయములు మాత్రమే వివరింపఁబడి రసమనిన, ఎట్టి పదార్థమో అది యీ గ్రంథమందు నిరూపింపఁబడుచున్నది.

రెండు విధములగు విభావములు.

ఆలంబనము, ఉద్దీపనము, అనుచు విభావము రెండు విధములు. ఆశ్రయము, విషయము అనుచు ఆలంబనము రెండు విధములు. రతి దేనియందు కలదో అది దానికి ఆధారరూప మగుచు ఆశ్రయ మనఁబడుచున్నది. రతి దేనిని గూర్చి పరుగిడి పోవుచుండునో అది ఆ రతికి విషయము.

విషయము, ఆశ్రయము

రతికి ఆశ్రయము జీవుఁడు ; రతికి విషయము కృష్ణుఁడు. కావున నే, నేను ఇప్పుడు విచారించుచున్న రతికి కృష్ణరతి అని పేరు. ఈ రతి రసస్థితిని పొందినంత నే ఆ రసము కృష్ణభక్తి రసమని చెప్పఁబడుచున్నది.

శ్రీకృష్ణుని గుణము, వయస్సు, మోహనత, సౌంద ర్యము, రూపము, చేష్ట, వసనము, భూషణము, స్మితము, సౌరభము, మురళి, శంఖము, పదాంక

ఉద్దీపనములు

క్షేత్రము (తాను మెట్టిన నెలవు), వృక్షము, భక్తజనము, అను నివి అన్నియును రసము నకు ఉద్దీపనములు.

ఏ కార్యములు గోచరించుటవలన రసస్థితి మనకు అను భవ నీయమగుచున్నదో, వానికన్నిఁటికి అనుభావము అను నామము కలదు. అనుభావము పదః

పదుమూఁడు అను భావములు

మూఁడు విధములు :—(1) నృత్యము (2) విలుఠనము (3) గీతము (4) క్రోశ నము (5) తను మోటనము (6) హుంకారము (7) జృంభ ణము (8) శ్వాసవృద్ధి (9) లోకాపేక్షాత్యాగము (10) లాలా స్రావము (11) అట్టహాసము (12) ఘూర్ణము (13) హిక్క.

ఈ అనుభావ లక్షణము లన్నియు ఏక కాలముననే ఉదయించుననుట సరికాదు. ఎప్పుడు, ఏ విధములగు రస కార్యములు లోన పనిజేయుచుండునో, వానికి అనురూపము లుగ ఒకటిగాని, అంతకు అధికములుగ గాని అనుభావములు తల సూపుచుండును.

సాత్త్వికభావములు ఎనిమిది విధములు. సకల విధము లగు భావములును స్నిగ్ధ, దిగ్ధ, రూక్ష,

ఎనిమిది విధములగు సాత్త్విక భావములు

జాతి భేదములచే మూఁడు విధములగు చున్నవి :-

(1) స్తంభము (2) స్వేదము (3) రోమాంచము (4) స్వరభేదము (5) కంపము (6) వైవర్ణ్యము (7) అశ్రుపాతము (8) ప్రళయము (మూర్ఛ).

ఇవి సాత్త్వికవికారములని చెప్పఁబడుచున్నవి. వీనిని కొందఱు అనుభావముల నడుమనే పరిగణించుచున్నారు. కాని యిచట వేఱుగ చూపుటకు కారణమేమనిన, ముందు చెప్పిన పదుమూఁడు అనుభావములును, ఆంగికములుగ, అనఁగా, ఒక్కొక్క అంగమును అండగా గైకొని ఉదయించును. కాని సాత్త్వికవికారములు సమస్త సత్త్వమును ఆధారముగ గైకొని ఉదయించి బయటికి వ్యాపించును.

బాహ్యక్షోభమే అనుభావము. ఆంతరమగు క్షోభము భావము. సాత్త్విక వికార సమూహమునందు ఇట్లు రెండు విధములు కలవు అని చెప్పుటచే వానియొక్క అనుభావత్వము, భావత్వము ఈరీతిని సిద్ధించుచున్నవి.

ఈ ఎనిమిది విధములగు సాత్త్విక భావములును స్థలవిశేషమునుబట్టి ధూమాయితములు, జ్వలితములు, దీప్తములు, ఉద్దీప్తములు అగుచు ప్రకాశమానము లగుచున్నవి. ఈ వికారములన్నియు కొందఱు కొందఱు వ్యక్తులయందు ఒక్కొక్కచోట ప్రకటితములగుచున్నను అవి సాత్త్విక వికారములని చెప్పరాదు.

రత్యాభాసము, సత్త్వాభాసము, ప్రతీపము.

ఆ యా స్థలములయందు వానిని హేయరత్యాభాసము లని యో,

సత్త్వాభాసము లనియో, నిస్సత్త్వములనియో, లేక ప్రతీపము లనియో చెప్పవలసియుండును.

మోక్షకాంక్షతో ఎవరు ఈశ్వరోపాసన సలుపుదురో, వారలు ప్రకటించు పులకాశ్రువులు రత్యాభాసములే అగుచున్నవి. హృదయ శైథిల్యము, లేక దౌర్బల్యము కల వారలకు అకారణముగ ఆహ్లాద విస్మయాదుల ఆభాసము కలుగును. అట్టి ఆభాసము కలుగుటచే, ఏ సకల వికారములు ఉదయించుచున్నవో అవి అన్నియు సత్త్వాభాస జనితములే.

ఎవరి అంతఃకరణము పిచ్ఛిలముగనుండునో, లేక ఎవరు అభ్యాసవశమున స్తంభ, పులక, అశ్రుప్రభృతులగు వికారములను ప్రకటింపఁగలిగి యుందురో, అట్టివారల పులకాశ్రువులు నిస్సత్త్వములు.

భగవంతుని యెడల విరుద్ధ భావముకలిగి తత్ప్రకటనార్థము ఏ వికారములు ప్రకాశితము లగుచున్నవో, అట్టి వికారములకు ప్రతీప మనిపేరు. ఇవన్నియు తుచ్ఛములు. సాత్త్వికులగువారు మంచి చెడ్డలను పరీక్షించుటకై సత్త్వాభాసము మున్నగున వన్నియు ఇచట ఉల్లేఖింపబడినవి. ఇంతకు తప్ప ఇవి మఱిదేనికిని ఉపకరింపవు.

సంచారీ భావములు, అనఁగా, వ్యభిచారీ భావములు ముప్పదిమూఁడు.

ముప్పది మూఁడు సంచారీ భావములు.

ఎట్లన,

(1) నిర్వేదము (2) విషాదము
(3) దైన్యము (4) గ్లాని

చున్నాడో, భగవంతుఁ డపుడు ఆస్వాద్య వస్తు వగుచున్నాఁడు. భగవంతుఁడెపుడు ఆస్వాదకుఁ డగుచున్నాఁడో, జీవుఁడపుడు ఆస్వాద్యవస్తు వగుచున్నాఁడు.

వాస్తవముగ రసమే ఆస్వాద్యవస్తువు. రసప్రక్రియయే ఆస్వాదనము. చేతనవస్తువే ఆస్వాదక తత్త్వము. రసము నిత్యమును, అఖండమును, అచింత్యమును, పరమానంద స్వరూపమును అగుచున్నది.

శుద్ధరతి మొదలు మహాభావ పర్యంతము రసము ఊర్ధ్వగతి నొందుచుండును. శుద్ధరతికి నీచగతి కలిగినచో రసము జడగత మోహము పర్యంతము

మహాభావము వికృతమగును. విశుద్ధమగు బుద్ధిగలవారలే రసోపలబ్ధి నొందగలవారలు. కేవల యుక్తి మూలమున రసతత్త్వము అనుభవమునకు రాఁజాలదు. యుక్తిచేత చిద్రసము అనుభవమునకు రాకపోవుట సరేకదా జడరసముకూడ విచారితము కాఁజాలదు.

విభావ, అనుభావ, సాత్త్విక, వ్యభిచారీ భావములు అను నాలుగును యథాయోగ్యముగ సమ్మిళితము లైనప్పుడే రసతత్త్వముయొక్క ప్రకటావస్థ కలుగుచున్నది. రసాస్వాదనమందు ఎవరికి యోగ్యత కలదో వారలే ఈ రస తత్త్వము నెఱుంగఁగలరు. జడరసమును ఆశ్రయించిన వారలకు పరమ రసాస్వాదనమందు అధికారము లేదు.



# ద్వితీయధార

## ఉపాసనామాత్రమునకు సంబంధించిన రసతత్త్వవిచారము

ఈశ్వరోపాసనము చేయు వారందఱును విచారింపఁదగిన విషయమెట్టిదియన, ఉపాసనా కార్యమనఁనేమి ? ఇది జడమయ కార్యమా ? లేక చింతామయ కార్యమా ? లేక, ఈ రెంటికిని వేఱగు మఱియొక ప్రక్రియా విశేషమా ? అనునది. ఉపాసనా కార్యమందు అధికముగ జడసంబంధము తోఁచుచున్నను తత్కార్యము కేవల జడానుశీలనముకంటె శ్రేష్ఠమైనదే. అట్లయినచో ఆశ్రేష్ఠత్వము ఏవిధముగ గలుగుచున్నది ? ఏమన, చింత జడము నతిక్రమించి యుండ జాలదుగదా ? ఉపాసన చింతాకార్యమని చెప్పినచో కేవల జడప్రసూతకల్పననే ఉపాసనయని చెప్పవలసివచ్చుచున్నది. జడరూపము కాక, చింతారూపముకూడ కాకున్నచో ఆ ఉపాసన యెట్టిదై యుండవలెను ?

ఉపాసనా కార్యమనఁనేమి ?

సామాన్య మానవుల సత్త యెట్టిదనిన, దానియందు జడలక్షణము, చింతాలక్షణము మించి వేఱొండు లక్షణమే గోచరింపదు. కావున మానవుఁడు నాస్తికుఁడగుటయో, లేక నిర్విశేషవాది యగుటయో సంభవించుచున్నది. జడమునకును, జడచింతకును కేవల విపరీతమగు నవస్థయే నిర్విశేషావస్థయని చెప్పఁబడుచున్నది. ఆ యవస్థ నాశ్రయించి నీరసమగు బ్రహ్మవాదమును స్వీకరించుటచే నాస్తికతయొక్క

వేఱొక లక్షణమే ఆశ్రయింపఁబడుచున్నది. ఇంకేమి ? ఉపాసన నిలిచిపోయినట్లే కదా ? ఎవనికొఱకు జీవులందఱును మిక్కిలి ఆత్రముతో ఎదురు చూచుచున్నారో అట్టి ఈశ్వరుఁడు ఆకాశ కుసుమమువలె మిథ్యాభూతుఁ డైనాఁడు కదా ? ఎంతకష్ట మెంతకష్టము !

సాధారణముగా గోచరించుచున్న జడము, జడీయ మగు చింత, అజడచింతారూపమగు నిర్విశేష భావము, అను నీ మూఁటిని అతిక్రమించి జీవుని సిద్ధస్వరూపమునే అనుసంధింపనగును. వీనిని అతిక్రమించి అనుసంధాన మొనర్పుమని చెప్పుటకు కారణమేమనిన, ప్రస్తుతము ఈమూఁడు విధములగు చింతలును నిన్ను బంధించి నీ స్వరూపమును ఆవరించి యుండుటయే. వీనిని అతిక్రమింపనిచో వీనిచేతులలో చిక్కియున్న జీవుఁడు వీనినుండి యెట్లు విముక్తుఁడు కాఁగలఁడు ? నీ కన్నులకు మూఁడుగంతలు కట్టఁబడి నీ దృష్టి నిరోధింపఁబడినప్పుడు ఆ మూఁడుగంతలను ఛేదించి నీ దృష్టి కవరోధము లేకుండజేసి తన్మూలమున పదార్థదృష్టి నొందుమనియే కదా చెప్పనగును ?

అట్లే నీసిద్ధదేహమందుగల నీ స్వనేత్రము జడము, జడచింత, జడాభావచింత అను మూఁడు గంతలచే కప్పఁబడినది. ఈ మూఁడుగంతలే నీకుగల

అనర్థములు

అనర్థములు. వీనిని తొలఁగించి నీ సహజ నేత్రమును ప్రకాశింపఁ జేయుము. జీవుని సహజనేత్రము ప్రకాశితమైనచో జడ

మయోపాసనముగాని, జడచింతామయోపాసనము గాని, జడ విపరీత చింతామయోపాసనముగాని, మఱి చేయఁబడదు.

అపుడు చిన్మయోపాసనమందే దృష్టి నిలుచును. ఆ చిన్మయోపాసనమునకే రసమని పేరు. కావున ఉపాసకులే రసానుశీలనము చేయువారు. వాస్తవ చిన్మయోపాసనమే రసము. ముగ రసమునందు అధికారము కల వారు అరుదుగ నుందురు. కావున ఈ రసతత్త్వము గోపనీయమగుచున్నది.

రసతత్త్వవిదుపాసకులనియు, రసవిచార శూన్యోపాసకులనియు, ఉపాసకులు రెండు విధములు. రస విచార శూన్యులైనను ఆచరణయందుఒకింత ఉపాసకులు రెండువిధములు. రసాలోచనమే చేయుచు తత్త్వ జ్ఞానము లేకుండుటచే దానిని చింతా గత ధ్యానమనియు, ధారణ అనియు, నిదిధ్యాసమనియు, సమాధి యనియు, ప్రార్థన అనియు, ఏబాదత్తుఅనియు, పూజ యనియు, ప్రేయర్ (Prayer) అనియు చెప్పుచు, ఇత్యాదు లగు నామము లిడుదురు.

ఏ సమయమందు ఉపాసకుఁడు పూజ, ఏబాదత్ మున్నగు కార్యములయందు నియుక్తుఁడగునో, అప్పుడు మెఱుఁపు దీఁగెవలె నొక భావము అతని అంతరాత్మనుండి బయలుదేరి మనస్సును కంపింపఁజేయును. మఱియు దేహ మందు రోమాంచము మున్నగునవి కూడ స్వల్పముగ వ్యాపించును. అప్పుడతఁడు, "నాకిప్పుడు కలిగిన ఈభావము

చిరస్థాయిగ నుండినచో మఱి నాకు కష్టముండదుకదా!" అని అనుకొనఁ జొచ్చును.

సోదరుఁడా! ఆ భావ మెట్టిది? అది జడధర్మమా? చింతాధర్మమా? లేక, జడ విపరీత ధర్మమా? సమస్త జగత్తును గాలించి వెదకినను జడమందు ఇట్టి భావము వొడమ నేరదు. జడమునందు అతి సూక్ష్మవస్తువులగు తటిత్ (Electricity), చౌంబక (Magnetism) పదార్థముల యందైన ఇట్టి భావావస్థ గోచరింపదు. చింతా కార్యమందు పరిశీలించినను దానిలోగూడ ఈ భావములేదు. జడ విపరీత చింతయందు బొత్తుగ లేదు.

అట్లయినచో ఈ భావము ఎచ్చటనుండి వచ్చినట్లు? బాగుగ ఆలోచించి చూడుము. జడముచే కప్పఁబడిన జీవుని సిద్ధస్వరూపమునుండి ఈ భావ ముద్భవించినది. ఈ భావము ఉపాసనాకాలమందే నీకు లభ్యమగు చున్నది. కాని దాని స్వరూపమెట్టిదో నీవు విచారించుటయే లేదు. రమ్ము. నేనది విచారించెదను. చూడుము.

ఆ అచింత్యభావము ఒకానొక వృత్తి విశేషము. ఆశ్రయ వ్యతీతముగ వృత్తి నిలువఁజాలదు. జడదేహమును, జడ చింతామయమగు మనస్సును ఎవనికి ఆచ్ఛాదనములై యొప్పుచున్నవో, అట్టి శుద్ధాత్మరూపుఁడగు జీవుఁడే ఈ వృత్తికి ఆశ్రయుఁడు. తన అణుత్వస్థితియొక్కయు, తాను ఇంకొక బృహత్తత్త్వమునకు అధీనుఁడగు విషయము యొక్కయు, ఆలోచన మెప్పుడుదయించుచున్నదో, అప్పుడు

అగ్గిపుల్ల గీచుటచేగాని, చెకుముకికి ఘర్షణ మబ్బుటచేగాని అగ్నిబయలు దేరిన విధమున, ఈవృత్తి జీవతత్త్వము నుండియే సత్వరముగ ప్రకాశితమగుచున్నది. ఆ భావము ఎవనివంక పరువిడునో, అతఁడేదానికి ఏకమాత్ర విషయము. ఉపాసనా కాలమందు విషయసాన్నిధ్యము కలుగుటచే ఆ వృత్తి ఆశ్రయమునుండి వెలువడి విషయమువంక పరువిడును.

వృత్తియే స్థాయీభావము. సాధక సాధ్యములు ఆలంబనములు. మఱియు విషయముయొక్క విలక్షితగుణ సమూహమే దానికి ఉద్దీపనము. ఇట్టి విభాగము ఆ భావమందు లక్షితమగుచున్నది.

వృత్తి ఏ క్షణమందు ఆశ్రయము, విషయము అను ఈ రెంటిని కలుపుచున్నదో ఆ క్షణమందే ఆశ్రయమందు కొన్ని క్రియా లక్షణ రూపములగు అనుభావములు లక్షితములగుచున్నవి. ఇంతకుముందు చెప్పఁబడిన పదుమూఁడు అనుభావములలో ఒకటిగాని, కొన్నిగాని అవశ్యముగ నపుడు గోచరించును. ఆ క్షణమందే హర్షముగాని, దైన్యముగాని, నిర్వేదముగాని, ముప్పదిమూఁడు వ్యభిచారీ భావములలో ఏవేవో ఇతర భావములుగాని ఉదయించి తద్వృత్తియందు దోఁచు క్రియలకు అవి సహాయభూతములుగ నుండును. పులకలు, అశ్రువులు, మున్నగు సాత్త్వక వికారములలో ఏవో ఒక కొన్ని ఉదయించి అపుడు చూపట్టును. ఉపాసన అనునది ఏమో ఇపుడాలోచించి చూడుము. ఉపాసనయొక్క అంగముల నన్నిఁటిని నేను వేఱుపఱచి చూపించియుంటిని.

ఇప్పుడు నీవు తెలిసికొనఁ గలిగినది ఎద్దియనిన, ఏరసము గుఱించి యింతకుపూర్వము నేను చెప్పియుంటినో, అదియే ఉపాసనమను విషయము. విభావ, అనుభావ, సాత్త్వికః, వ్యభిచారీ భావములు అనెడి నాల్గింటిచే స్థాయీభావమునకు కలుగు ఆస్వాదావస్థయే ఉపాసనయందు లక్షితమగుచున్నది. కావున, ఉపాసనమే రసము.

జడక్రియయు, జడచింతయు, జడవిపరీతమగు నిర్విశేషచింతయు ఒకప్పుడైనను ఉపాసన అనిపించుకొనవు.

జడచింతగాని, నిర్విశేషచింతగాని ఉపాసన కాదు.

ఆక్రియలన్నియు సర్వదా నీరసములే అగుచున్నవి. ఇంకనువిశేషమేమనిన, ఉపాసనము చేయు సమస్త సంప్రదాయముల వారును రసప్రక్రియనే అవలంబించుచున్నారు. కాని రసవిజ్ఞానము వారికి లేనందున వారొనర్చు క్రియలను వైజ్ఞానిక విధమున వారు విశదీకరింపఁ జాలకున్నారు. పూర్వసంగ సంస్కారమే ఈ అనర్థములకు హేతువగుచున్నది.

రసభావగతమగు ఉపాసనము మూఁడు విధములు.

రసభావగత ఉపాసనము

(1) కుంఠితము (2) స్వల్పవికచితము (3) వికచితము.

కుంఠితోపాసకులు ఉపాసనాకాలమందు రసమును అత్యంత కుంఠితరూపమున అనుభవించుచున్నారు. కావున

(1) కుంఠితము

వారు ఉపాసనాకార్యమును విడిచిపెట్టిన ఉత్తరక్షణమందే వారల

రసము అంతరించుచున్నది. దీనికి కారణ మేమనిన, వా రందఱును జడరసముచే భోగించుచున్నారు.

రసము వినా జీవనమే నిలువదు. వారల జీవనము సర్వదా జడరసమయము. చిద్రసము వారి జీవనమందు మెఱుపుకాంతివలె క్షణకాలముండునట్టి వ్యాపారవిశేషమే. సద్గురువు లభించుటచేతను, సాధుసంగబలము చేతను, ఈ క్షణికావస్థ ఉన్నతిలాభమునొంది క్రమముగ ప్రస్ఫుటితావస్థ అగుచున్నది. సాధుసంగము లభింపకపోవుట చేతను, నాస్తికులయొక్కయు, నిర్విశేషవాదులయొక్కయు ఉపదేశములు పాలించుటచేతను ఈ కుంఠితోపాసనము క్రమముగ అతికుంఠితము, అత్యంతకుంఠితము, తుదకు విలుప్తప్రాయము నగు అవస్థ నొందుచున్నది. ఇది జీవుని అత్యంత దౌర్భాగ్యస్థితినే ప్రకటించుచున్నది.

స్వల్పవికచితావస్థయందు ఉపాసనము జీవితముయొక్క అధికాంశమునే వ్యాపించియుండును. రసవృత్తాంతము ఎప్పుడు వినఁబడునో, అప్పుడే దానియందు ప్రీతి కలుగుచున్నది. ఆ అవస్థయందు నాస్తికులును, నిర్విశేష వాదులును, మిగుల ఉదాసీన భావమే కలిగియుందురు.

(2) స్వల్పవికచితము

ఉపాసనయొక్క వికచితావస్థయందు రసము యథాగతముగఁ దెలియఁ బడుచున్నది. అట్లు తెలియఁబడి తన కార్యమును అప్రతిహతరూపమున నొనర్చుకొనుచున్నది. ఈ వికచితావస్థ

(3) వికచితము.

యందు రసము శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, మధురము లనెడి పంచవిధ రూపములచే తెలియఁబడుచున్నది. సఖ్య, వాత్సల్య, మధురరసములకు అధికారులు స్వల్పసంఖ్యాకులు. బహుభాగ్యఫలముగ ఈ సకల రసములయందును జీవునికి రుచి కలుగుచున్నది.



చున్నాడు. కాని బ్రహ్మయందు నిత్యవిశేషత్వము కలదను సిద్ధాంతమందు వారల కింకను దృఢవిశ్వాసము లేనందున తద్విషయమై కొంతవఱకు అస్థిరభావమునే కలిగి యుందురు. కనుక ఒకప్పుడు చతుర్భుజ స్వరూపము, ఒకప్పుడు ఐశ్వర్య గత శ్రీకృష్ణస్వరూపము, ఒకప్పుడు ఆధ్యాత్మికమగు పరమాత్మ స్వరూపము వారల చిత్తములందు ఉదయించుచుండును.

సనక, సనాతన, సనంద, సనత్కుమార ప్రభృతులగు ఋషులు ఈ శాంతభక్తికి ఆదర్శప్రాయులు. భగవంతునకు నిత్యస్వరూపము కలదను విషయమందు వారలకు స్థిర విశ్వాసము లేనందున శాంతభక్తులకు కృష్ణునియందు మమత్వము కలుగదు. మమత్వము స్వాభావికముగ స్వరూపముతో సంబంధించిన భావ విశేషము. కావున శాంతభక్తుని రతికి సంబంధ-అభావము కలుగుటచే అది శుద్ధావస్థయందే సదా ఒప్పుచుండును.

శాంతరతికి విషయము.

సచ్చిదానంద ఘనీభూత స్వరూపుడును, ఆత్మారామ శిరోమణియు, పరమాత్మయు, పరబ్రహ్మయు, సదా స్వరూప సంప్రాప్తుడును, గతి దాతయు, దయాశీలుడును, విభుడును అగుచు తత్సంబంధ గుణ విశిష్టుడగు హరియే శాంతరతికి ఆలంబనము, అనగా విషయము. ఈరతికి ఆశ్రయుడగు జీవుడు ఆత్మారాముడో, తాపసుడో అగుచున్నాడు. సమస్తగుణ వర్జితమును,

అతీంద్రియమును, స్వప్రకాశమును, చిద్ఘనమును అగు ఒకా నొక ముకుంద నామముగల వస్తువుయొక్క సాక్షాత్కార ణామే స్వభావముగా గలరతి దీనికి స్థాయీ భావము. మిక్కిలి ప్రధానములగు ఉపనిషత్తులను వినుచుండుట, ఏకాంత స్థల మందు ఉనికి, అంతర్వృత్తి విశేషముయొక్క స్ఫూర్తియు, తత్త్వవిచారము, విద్యాశక్తిప్రభావము, విశ్వరూప దర్శ నము, తత్త్వవేత్తలగు భక్తజనులతో సహవాసము, బ్రహ్మసుతము, అనఁగా, తమవిద్యతో సమానమగు విద్య గలవారితో కలసి ఉపనిషద్విచారము, వేదాంత సూత్ర విచారము చేయుట మున్నగునవి అన్నియు శాంతరసమునకు ఉద్దీపనములుగ చెప్పఁబడుచున్నవి.

నాసికాగ్ర దర్శనము, అవధూతచేష్టయు, గమన సమయమందు నాలుగు మూరల దూరము మాత్రమే దృష్టి నెరపుటయు, అంగుష్ఠ తర్జనీ స్పర్శరూపమగు జ్ఞానముద్రా ప్రదర్శనము, భగవంతుని ద్వేషించువారలయెడల ద్వేషము లేకుండుటయు, భక్తజనులయెడల సామాన్య సన్మానము చూపుటయు, అత్యంత సంసారధ్వంస రూపమగు సిద్ధి యెడల ఆదరము కలిగియుండుటయు, స్థూల సూక్ష్మ శరీరము లందు అనాసక్తితో గూడుకొన్న స్థితిరూపమగు జీవన్ముక్తిని బహుమానించుటయు, నిరపేక్షత్వము, నిర్మమత్వము, నిరహంకారత్వము,మౌనము మున్నగు క్రియాసమూహములు శాంతరతికి అనుభావములు.

ప్రళయము తప్ప తక్కిన రోమాంచ ప్రభృతి సాత్త్విక భావములన్నియు శాంతభక్తులయందు గోచరించుచుండును

కాని వారలకు శరీర గతాభిమానము బొత్తుగ లేకుండుటచే ఈ సాత్త్వికభావములన్నియు కేవల ధూమాయితావస్థనే పొందుచున్నవి. కొన్ని స్థలములయందు జ్వలితములై ఒప్పు చున్నను అవి ఎన్నఁడును దీప్తములుగాని, ఉద్దీప్తములుగాని కాఁజాలవు.

శాంతరసమందు నిర్వేదము, ధైర్యము, హర్షము, మతి, స్మృతి, ఔత్సుక్యము, ఆవేగము, వితర్కము మున్నగు వ్యభిచారీ (సంచారీ) భావములు అచ్చటచ్చట లక్షితము లగుచున్నవి. ఇటువంటి విశేషములతో గూడుకొని యుండుట చేతనే శాంతరసము రసములలోనే పరిగణింపఁబడుచున్నది. వ్రజలీలా రూపమగు చిద్రసవర్ణనమందు శాంత రసము చూపట్టుటలేదు; ఏమన, ఈరస మొకానొక విశేషసిద్ధమగు ఏకస్వరూపమునకు సంబంధించునది కాదు. కావుననే, అది మమతా శూన్యమగుచున్నది. జీవుని బహుభాగ్యఫలముగనే భగవత్స్వరూపమందు మమత ఉదయించుచున్నది. అట్టి మమత జనించినచో శుద్ధరతి ప్రేమరూపమున పుష్టి నొందుచున్నది. అపుడు ప్రీతభక్తిరసము ప్రకాశితమగు చున్నది.



# చతుర్థధార



## ప్రీతభక్తిరసవిచారము

ప్రీతభక్తిరసమునే అనేకులు దాస్యరసమని చెప్పుదురు.

దాస్యరసము

కాని ప్రీతభక్తిరసము రెండు విధములు. ఎట్లన :—

(1) సంభ్రమగత ప్రీతరసము (2) గౌరవగత ప్రీతరసము. సంభ్రమగత ప్రీతరసము దాస్యమని చెప్పఁబడుచున్నది. గౌరవగత ప్రీతరసము గౌరవ ప్రీతభక్తరసమని చెప్పఁబడుచున్నది. కాని అది దాస్యమని చెప్పఁబడదు. సంభ్రమశూన్యమగు ఉపాసనము, అనఁగా, రసపద్ధతి సామాన్యజనుల కొఱకగునది కాదు. బహుభాగ్యక్రమముచే ఏ జీవులకుగల కృష్ణరతి సంభ్రమశూన్యత్వమును, విస్రంభమయత్వమును. అనుకంపాత్మత్వమును, కేవల కామాత్మత్వమును వహించుచున్నదో అట్టివానికి సంబంధించి, ఆ యా విషయములుగల అనేక శాస్త్రములు కలవు. విశేష మేమన, ఆ యా అవస్థలయందున్న వారలకు శాస్త్రాపేక్షకూడ ఉండదు. వారల స్వభావమే వారల దివ్యశాస్త్రము.

రత్యుదయముగల పురుషులకు శాస్త్రాపేక్ష లేకున్నను వారల మార్గము సామాన్యజనులకు చూపించుట కొఱకు ఏ రస తత్త్వము వక్కాణింపఁబడుచున్నదో దానియందు సంభ్రమగతరతి పర్యంతమే చర్చింపబడినది. ఈ గ్రంథమునందు ఉద్దేశింపఁబడిన దేమియన, ఇంతకుదాఁటి పైకిపోవుట

ఉచితము కాదనియే. కావున నేను కేవల దాస్యరసమును మించి అధికదూరము పోవువాఁడను కాను.

ప్రీతభక్తిరసమందు నిర్దిష్ట స్వరూపగతమగు భగవత్తత్త్వమే విషయముగ స్వీకరింపఁబడు చున్నది. ఆ స్వరూపగత భగవత్తత్త్వ (Personality of God) ము ఐశ్వర్య మయము, మాధుర్యమయము అనుచు రెండు విధములు. శ్రీకృష్ణ స్వరూపముకంటె పరమ మాధుర్యమగు అన్య స్వరూపము ఎంతటి వైజ్ఞానిక విచారము సలిపినను గోచరింప దనిమాత్ర మిచట చెప్పవలసి యున్నది.

రెండు విధములగు భగవత్తత్త్వ స్వరూపము.

శ్రీకృష్ణ స్వరూపమందు సమస్త ఐశ్వర్యము ఇమిడియే యున్నది. కాని మాధుర్య ప్రాబల్యముచే ఐశ్వర్యము మఱఁగుపడెను. అయినను అవసరమునుబట్టి మాధుర్యస్వరూపమునకు అవిరోధి రూపమున ఆయా సమయములయందు అది కార్యాచరణ మొనర్చుచున్నది. ఈ తత్త్వమును గూర్చి యింకను విశేషముగఁ దెలిసికొనవలయునని కోర్కెగలవారు శ్రీ జీవగోస్వామి రచించిన "షట్సందర్భము" అనుగ్రంథమును, నేను రచించిన, "శ్రీకృష్ణసంహిత" అనుగ్రంథమును పఠించుట అత్యావశ్యకము. వ్రజనాథుని మాధుర్యమయ భావమువంటి భావము వేఱొకచోట ఎచ్చటనులేదు. కావున శుద్ధదాస్యమందు వ్రజగత దాస్యమే నేనిచట విచారించెడి విషయము.

ఐశ్వర్యము, మాధుర్యము.

పరమ మాధుర్యమయమగు శ్రీకృష్ణదాస్య భావము ఉదయించినచో జీవుఁడు తాను కృష్ణానుగ్రహ పాత్రుఁడను అభిమానము వహించును. దానియందు కృష్ణదాసాభిమాన రూపమగు సంభ్రమోత్తర ప్రీతి గోచరించును.

ఇట్టి దాస్యరసముయొక్క వివరణ మెట్లనిన,

దాస్యరసముయొక్క వివరణము

(1) విషయ రూపాలంబనము — కోట్లకొలఁది బ్రహ్మాండములు ఒక్కొక్క రోమకూపమున గలవాఁడును, కృపాసముద్రుఁడును, అవిచింత్య మహాశక్తి సంపన్నుఁడును, సర్వసిద్ధులచే సేవింపఁబడువాఁడును, సమస్త అవతారములకును బీజస్వరూపుఁడును, సర్వవిధములచేతను ఆత్మారాముల చిత్తము నాకర్షించువాఁడును, సమస్త ప్రభువులకు ప్రభువును, పరమారాధ్యుఁడును, సర్వజ్ఞుఁడును, సుదృఢవ్రతుఁడును, క్షమాశీలుఁడును, శరణాగత పాలకుఁడును, దక్షిణుఁడును, సత్యస్వరూపుఁడును, సర్వకర్మ దక్షుఁడును, సర్వ శుభంకరుఁడును, ప్రతాపవంతుఁడును, శుద్ధుఁడును, న్యాయశీలుఁడును, భక్తసుహృత్తును, వదాన్యుఁడును, సర్వ తేజోమయుఁడును, సర్వబలశాలియు, పరమ కీర్తిమంతుఁడును, కృతజ్ఞుఁడును, ప్రేమవశ్యుఁడును, పరాత్పర వస్తువును అగు శ్రీకృష్ణుఁడే విషయరూప ఆలంబనము.

(2) ఆశ్రయరూపాలంబనము — (i) అధికృతుఁడు (ii) ఆశ్రితుఁడు, (iii) పారిషదుఁడు, (iv) అనుగుఁడు అను

దాస్యము యొక్క ఆశ్రయము — నాలుగు విధములగు దాసజనమే ఈ రసమునకు ఆశ్రయరూపాలంబనము.

(i) బ్రహ్మ శంకరుఁడు ఇంద్రుఁడు మున్నగు దాసగణము కృష్ణకృపచే అధికార ప్రాప్తజీవులగుచు అధికృత దాసు లనఁబడుచున్నారు. — అధికృతదాసులు

(ii) ఆశ్రితదాసగణము మూఁడు విధములు :—(a) శరణ్యుఁడు (b) జ్ఞానచరుఁడు. (c) సేవానిష్ఠుఁడు. — ఆశ్రితదాసులు

(a) కాళీయుఁడు, జరాసంధుఁడు, బందీకృతులగు రాజులందఱు శరణ్యాశ్రితదాసులు.

(b) శౌనకాదులగు ఋషులు ముక్తి వాంఛ తొలఁగిన వారగుచు జ్ఞానచరాశ్రిత దాసులగుచున్నారు.

(c) చంద్రధ్వజుఁడు. హైహయుఁడు, బహులాశ్వుఁడు, ఇక్ష్వాకువు, శ్రుతదేవుఁడు, పుండరీకుఁడు మున్నగు వారలకు మొదటినుండియు భజనాసక్తి కలిగియుండుటచే వారు సేవానిష్ఠాశ్రిత దాసులుగ పరిగణింపఁబడుచున్నారు.

(iii) ఉద్ధవుఁడు, దారుకుఁడు, నందుఁడు, ఉపనందుఁడు, భద్రకుఁడు మున్నగువారు పారిషద దాసులు వారలు ఆ యా సమయముల యందు కృష్ణపరిచర్య చేయుచుందురు. — పారిషద దాసులు

(iv) అనుగ దాసగణము "పురస్థ", "వ్రజస్థ" భేదములచే రెండు విధములు. వీరందఱును సదా పరిచర్యయే చేయుచుందురు.

అనుగ దాసులు

సుచంద్రుఁడు, మండనుఁడు, స్తంభుఁడు, సుతన్వుఁడు మున్నగువారు పురస్థదాసులు.

రక్తకుఁడు, పత్రకుఁడు, పత్రి, మధుకంఠుఁడు, మధువ్రతుఁడు, రసాలుఁడు, సువిలాసుఁడు, ప్రేమకందుఁడు, మరందకుఁడు, ఆనందుఁడు, చంద్రహాసుఁడు, పయోదుఁడు, వకుళుఁడు, రసదుఁడు, శారదుఁడు మున్నగువారు వ్రజస్థులగు అనుగ దాసులు.

సమస్తదాసజనము ప్రశ్రితులును, నిదేశవర్తులును, విశ్వస్థులును, ప్రభుతాజ్ఞానము కలిగియుండుటచే నమ్రబుద్ధులును అగుచున్నారు.

వీరిలో కొందఱు ధూమ్యాదాసులు ; కొందఱు ధీరదాసులు ; కొందఱు వీరదాసులును.

పైనిఁజెప్పిన నాలుగు విధములగు దాసగణమందలి ఆశ్రిత, పారిషద, అనుగ భేదములు కలవారలలో కొందఱు నిత్యసిద్ధులు ; కొందఱు సిద్ధులు ; కొందఱు సాధకులును.

(లి) ఉద్దీపనము—కృష్ణ మురళీశబ్దము, శృంగధ్వని, సహాస్యావలోకనము, గుణోత్కర్ష శ్రవణము, పద్మము, పద్మ చిహ్నము, నూతన మేఘము, అంగ సౌరభము మున్నగునవి సాధారణోద్దీపనములు.

దాస్యరసమునకు ఉద్దీపనములు

కృష్ణానుగ్రహము, చరణతులసియు, ప్రసాదాన్నము, చరణామృతము అనునవి కృష్ణభక్త గణమునకు విశేషోద్దీపనములు.

దాస్యరసముయొక్క విభావ వర్ణనము పూర్తియైనది.

అనుభావములు

ఈ రసమునకు సంబంధించిన అనుభావముల విషయమై చెప్పవలసినది ఏమున్నదనిన, సాధారణముగ రసమునకు సంబంధించి ఏ పదుమూఁడు అనుభావములు చెప్పఁబడినవో అవికాక క్రిందవివరించిన మఱికొన్ని అనుభావములు దాసభక్తులయందు చూపట్టుచున్నవి. అవి ఏవన,

(1) సర్వవిధములచేత ఆజ్ఞాపాలన మొనర్చుటయు,
(2) కృష్ణదాసులతోడి మైత్రియు,
(3) భగవత్పరిచర్యయందు ఈర్ష్యలేకుండుటయు,
(4) ప్రీతిమాత్ర నిష్ఠయును.

దాస్యరసమందు స్తంభాదులగు అష్టప్రకార సాత్త్విక వికారములును లిఖింపఁబడినవి. ఈ రసమందు హర్షము, గర్వము, స్మృతి, నిర్వేదము, విషణ్ణత, దైన్యము, చింత, శంక, మతి, ఔత్సుక్యము, చాపల్యము, వితర్కము, ఆవేగము, లజ్జ, జడత్వము, మోహము, ఉన్మాదము, అవహిత్థ (భావగోపనము), బోధ, స్వప్నము, క్లమము, వ్యాధి, మృతి అనునట్టి కొన్ని వ్యభిచారీ భావములు కూడ కార్యాచరణ మొనర్చును.

ఆ రసమే వానిచే అనుకరణీయమగుచున్నది. సిద్ధి సమయమందు ఏతద్రసోచితమగు జీవనలాభమే కలుగుచున్నది.

సంభ్రమప్రీతి యింతపర్యంతమే. దేహసంబంధమగు మానము కారణముగా గలిగిన గురుబుద్ధికే గౌరవమని పేరు. గౌరవమయమగు లాల్యప్రీతికే గౌరవప్రీతి అని పేరు.

గౌరవ ప్రీతి

అది రసామృతసింధు గ్రంథమున విచారింపఁబడినది. నేను ఆ విషయముగూర్చి అధికముగ ఇచట చెప్పఁదలఁచుకొనలేదు.



# పంచమధార

## ప్రేమభక్తి రసము, సఖ్యరసము

సఖ్యరసము, విషయాలంబనములు

ఆత్మోచితములగు విభావాదులచే చిత్తమున పొడసూపిన సాధుజన సమ్మతమగు స్థాయీభావము, సఖ్యరసమును పుష్టినొందిన ద్చుటే యిందు వర్ణింపఁబడుచున్నది.

శ్రీకృష్ణుఁడును, అతని వయస్యగణమును ఈ రసమునకు ఆలంబనములు. ద్విభుజుఁడగు భగవంతుఁడే విషయరూప ఆలంబనము.

సువేషధారియు, సర్వసల్లక్షణ యుక్తుఁడును, బలిష్ఠుఁడును, వివిధాద్భుత భాషావేత్తయు, యుక్తియుక్తముగ మాట్లాడువాఁడును, సుపండితుఁడును, అతిశయ ప్రతిభాశాలియు, దక్షుఁడును, కరుణావిశిష్టుఁడును, వీర శేఖరుఁడును, విదగ్ధుఁడును, బుద్ధిమంతుఁడును, క్షమావిశిష్టుఁడును, లోకానురాగ నిలయుఁడును, సమృద్ధిమంతుఁడును, సుఖియు, శ్రేష్ఠుఁడును అగు కృష్ణునియందు ఆ యాగుణములు సహజముగనే ఒప్పుచుండును.

కృష్ణ సఖులు రెండు విధములు

వాని వయస్యులుకూడ రూప, వేష, గుణాదు లన్నింటిలో కృష్ణునితో సమానులును, సమ్యక్ స్వాతంత్ర్యులును, విస్రంభ లక్షణ లక్షితులును. పురవాసి సఖులు, వ్రజవాసి సఖులు అనుచు కృష్ణ సఖులు రెండు విధములు.

అర్జునుఁడు, భీమసేనుఁడు, ద్రౌపది, శ్రీదాముఁడను బ్రాహ్మణుఁడు మున్నగువారు పురవాసి సఖులు. వారిలో శ్రేష్ఠుఁడర్జునుఁడు, కృష్ణదర్శనము ఒక్క క్షణకాలము లభింపక పోయినను ఎవరు దుఃఖితులగుచుందురో, ఎవరు సదా కృష్ణుని తోడనే విహరింపఁ గోరుచుందురో, ఎవరికి కృష్ణుఁడే జీవనమో, అట్టివయస్యగణమే కృష్ణుని వ్రజవాసిసఖులు.

కృష్ణుని వయస్యులందఱిలో వ్రజవాసి సఖులే ప్రధానులని మనకుఁ దెలియుచున్నది. (1) సుహృత్తులు (2) సఖులు (3) ప్రియసఖులు (4) ప్రియనర్మసఖులు అను నాలుగు విధములగు సఖులు వ్రజమందు నిత్యము కృష్ణసేవ చేయుచుందురు.

సుహృద్గణము యొక్క సఖ్యము వాత్సల్యమిశ్రమము. వారలు కృష్ణునికంటె కొంచెము అధికవయస్సుగలవారగుచు అస్త్రములు ధరించి దుష్టగణమునుండి కృష్ణుని రక్షించు ప్రయత్నమునందే సదా ఉందురు.

సుహృత్తులు. సుభద్రుఁడు, మండలీభద్రుఁడు, భద్రవర్ధనుఁడు, గోభటుఁడు, యక్షుఁడు, ఇంద్రభటుఁడు, భద్రాంగుఁడు, వీరభద్రుఁడు, మహాగుణుఁడు, విజయుఁడు, బలభద్రుడు మున్నగువారు కృష్ణ సుహృత్తులుగ కీర్తింపఁబడుచున్నారు.

సఖులు. కనిష్ఠులుగ భావింపఁబడువారును, దాస్యమిశ్రమగు సఖ్యముగలవారును, అగు విశాలుఁడు, వృషభుఁడు, ఓజస్వి, దేవప్రస్థుఁడు,

వరూథపుఁడు, అరందుఁడు, కుసుమాపీడుఁడు, మణిబంధుఁడు, కరందముఁడు అనువారు కృష్ణుని సఖాగణమగుచు కృష్ణ సేవా సౌఖ్యమునే సదా అభిలషించుచుందురు. ఈ సఖులలో దేవప్రస్థుఁడే శ్రేష్ఠుఁడుగ చెప్పఁబడుచున్నాఁడు.

ప్రియసఖులు. శ్రీదాముఁడు, సుదాముఁడు, దాముఁడు, వసుదాముఁడు, కింకిణి, స్తోకకృష్ణుఁడు, అంశుఁడు, భద్రసేనుఁడు, విలాసి, పుండరీకుఁడు, విటంకుఁడు, కలవింకుఁడు మున్నగువారు ప్రియసఖులుగ చెప్పఁబడుచున్నారు. వివిధములగు కేళీవిలాసముల చేతను, దండయుద్ధము మున్నగువాని చేతను, వారు కృష్ణుని సంతోషపఱచుచుందురు.

ప్రియనర్మసఖులు. ప్రియనర్మసఖులు ముందు చెప్పఁబడిన మూఁడు విధములగు సఖులకంటె శ్రేష్ఠులు. అత్యంత రహస్యములగు భావవిశేషములు గలవారగుటచే వారలు శ్రేష్ఠులని చెప్పఁబడుచున్నారు. వారల నామములు సుబలుఁడు, అర్జునుఁడు, గంధర్వుఁడు, వసంతుఁడు, ఉజ్జ్వలుఁడు మున్నగునవి. ప్రియనర్మసఖులలో సుబలుఁడు, ఉజ్జ్వలుఁడు మిక్కిలి శ్రేష్ఠులు. ఉజ్జ్వలుఁడు విశేషించి పరిహాస చతురుఁడు.

పైనిఁజెప్పిన సఖులందఱును (1) నిత్య ప్రియులు (2) సురచరులు (3) సాధకులు అనుచు మఱల మూఁడు విధములగు భేదము కలిగియున్నారు. వారిలో కొందఱు మంత్రి పదవి నలంకరించి కృష్ణునకు బుద్ధిసహాయమిడుచు

తన్మ్నాలమున కృష్ణోపాసనము చేయుదురు. కొందఱు చపల స్వభావము కలిగి పరిహాసపరాయణులగుచును, కొందఱు తమ ఋజువ్యవహారముచేతను కృష్ణుని సంతోషపరచుచుందురు. కొందఱు ప్రతికూల వక్రభావములు కలిగి తన్మ్నాలమున కృష్ణుని విస్మితునిగ నొనర్తురు. కొందఱు ప్రేలుడుగాయలగు బాలకులు కృష్ణునితో వాదప్రతివాదము లొనర్తురు. కొందఱు సుశీల ప్రకటనములగు మృదుమధుర వాక్యములతో కృష్ణుని సంప్రీతునిగ జేయుదురు.

సఖులందఱును కృష్ణునితో తమకు సహజముగ గలిగిన మధురమును, పవిత్రమును అగు బంధుత్వమును బట్టి సకల కార్యములందును విచిత్రతనే వారు కలిగించుచున్నారు.

సఖ్యరసమునకు ఉద్దీపనము.

ఈ సఖ్యరసమునకు ఉద్దీపనము లెవ్వియనిన, వయస్సు, రూపము, శృంగము, వేణువు, శంఖము, వినోద నర్మాలాపము, విక్రమము మున్నగు గుణములును, ప్రియజనము యొక్కయు, రాజులయొక్కయు, దేవతలయొక్కయు, అవతార పురుషులు మున్నగువారల యొక్కయు చేష్టలను అనుకరించుట మున్నగునవియును ఈ రసమునకు ఉద్దీపనములు.

సఖ్యరసమునందు కౌమారము, పౌగండము, కైశోరము అనెడివయస్సులు నిత్యత్వము వహించి యుండును. కౌమార పౌగండములు గోష్ఠమునందు వర్తమానములగుచుండును. కైశోరము పురమందును, గోష్ఠమందునుకూడ

వర్తించుచున్నది. వాత్సల్యరసమునందు ఉపయోగించునది కౌమారము.

ఆద్యము, మధ్యమము, శేషము అనుచు పౌగండము మూఁడు విధములు. మధ్యపౌగండమందు హరి అత్యద్భుతముగ విరాజిల్లుచుండును. కైశోరము యొక్క అగ్రాంశమందు మాధుర్యముయొక్క అద్భుతరూపత్వము దేదీప్యమానమై యుండును.

ఈ రసమునకు అనుభావములు బాహుయుద్ధము, కందుకక్రీడ, ద్యూతము, వాహ్యావాహక కేళీవిలాసము, పరస్పరయష్టిక్రీడ, యుద్ధముచేసి కృష్ణతోషణ మొనర్చుట, పర్యంకమందును, ఆసనమందును, ఉయ్యాలయందును కలసి పండుకొనుట గూర్చుండుట, పరిహాసము, జలవిహారము మున్నగునవి. కృష్ణునితోఁగలసి నృత్యగీతాదు లొనర్చుట సఖులందఱకు సాధారణ కార్యము.

కర్తవ్యాకర్తవ్యముల నుపదేశించుట, హితాహిత కార్యములను నిరూపించుట, కృష్ణుని ఆయా కార్యములందు ప్రవర్తింపఁజేసి తాము ఆ కార్యనిర్వహణమందు నాయకత్వము వహించుట, అనునవి సకల సుహృద్గణ మొనరించు కార్యము.

కృష్ణుని నోఁటియందు తాంబూలముంచుట, నుదుట తిలక మిడుట, శరీరమున చందనము పూయుట, ముఖమండలమందు చిత్రవిచిత్రములను రచించుట, అనునవి సకలసఖులు చేయు కర్మములు.

ప్రియ సఖాగణము కృష్ణుని యుద్ధమునందు ఓడింతురు. మఱియు వాని వస్త్రమునుబట్టి లాగుట, వానిచేతియందలి పుష్పమాలికను ఊడబెఱుకుట, కృష్ణునిచే తాము అలంకరింపఁబడుట, కృష్ణునితో చేతులు చేతులు కలిపి ప్రసంగించుట మున్నగునవి ఒనర్చి కృష్ణునకు సంతోషము కలిగింతురు.

వ్రజసుందరులతో దౌత్యకార్య మొనర్చుట, కృష్ణునికి వారలయెడల కలిగియున్న ప్రణయమును అనుమోదించుట, వ్రజసుందరులతో కృష్ణుఁడు కలహించుచున్నప్పుడు కృష్ణపక్షమును సమర్థించుట, వారల పరోక్షమందు, అనఁగా, వ్రజకిశోరీగణము లేనప్పుడు యూథేశ్వరీ (శ్రీమతి రాధికా) పక్షము సమర్థించుటయందు చాతుర్యము కలిగియుండుట, కర్ణాకర్ణి వాక్యకథనము అనునవి సకలప్రియనర్మసఖులు ఒనర్చెడి కార్యములు.

వన్యపుష్పములతోడను, రత్నభూషణములతోడను, కృష్ణునలంకరించుట, కృష్ణుని యెదుట నృత్యగీతము లొనర్చుట, గోసంరక్షణ మొనర్చుట, అంగమర్దన మొనర్చుట, పుష్పమాలలను రచించుట, వింజామరతో కృష్ణునికి విసరుట మున్నగునవి దాసగణముతో పాటు వయస్యగణముకూడ చేయునట్టి సాధారణ కార్యములు.

ఈ రసమునందు వ్యభిచారీ భావములగు ఉగ్రత్వ, త్రాసము, ఆలస్యము అనెడి భావములుతప్ప తక్కిన అన్ని సంచారీభావములును, మఱియు వియోగకాలమందు మదము, హర్షము, గర్వము, నిద్ర, ధృతి అనునవితప్ప తక్కిన అన్ని

వ్యభిచారీభావములును, సంయోగ కాలమందు మృతి, క్లమము, వ్యాధి, అపస్మృతి, దీనత్వము మున్నగుభావములు తప్ప తక్కిన సకలభావములును ప్రకాశించుచుండును.

ఈ రసమునకు సంభ్రమశూన్యమును, విశ్వాస మయ
మును అగు రతియే స్థాయీభావము.

విస్రంభము — నిశ్చ్యబాధాకర మగు గాఢ విశ్వాసమే విస్రంభ మనఁబడు చున్నది. దానినే సంభ్రమశూన్య విశ్వాసమనికూడ చెప్పుదురు.

ప్రణయ క్రమమునుబట్టి ప్రేమను స్నేహరాగ పర్యంతమే సఖ్యరతియందు వృద్ధిలాభము నొందుచున్నది. సంభ్రమాది యోగ్యత ప్రాప్తించినను రతికి ఎప్పుడు సంభ్రమము యొక్క వాసన తగులకుండునో అప్పుడు దానిని ప్రణయమని చెప్పుదురు. ప్రకటలీల ననుసరించి యీ రసమందు విరహము వర్ణింపఁబడినది. కాని వాస్తవముగ శ్రీకృష్ణునితో వ్రజవాసులకు ఎన్నఁడు ఎడఁబాటు లేదు.

కృష్ణునకును, కృష్ణసఖులకును గల ఏకజాతీయభావము మాధుర్యమయమును, ప్రియతమమును అగుచు ఈ రసమునకు ఒకానొక అనిర్వచనీయమగు చిత్తచమత్కృతిని గూర్చుచున్నది. ప్రీతభక్తి రసమందును, వాత్సల్య రసమందును, కృష్ణునకును, కృష్ణభక్తులకును పరస్పరభిన్న జాతీయభావము కలదు. రసములన్నింటిలో ప్రేయ (సఖ్య) రసమే ప్రియతర రసమగుచున్నది. సఖ్యరసవిశిష్టులగు సాధువులే దీనిని అనుభవించుచున్నారు.

# షష్ఠధార



## వత్సల భక్తి రసము

వాత్సల్యరసము.

విభావాదుల మూలమున వాత్సల్యము పుష్టిలాభము నొందినచో పండితులు దానినే స్థాయీ వత్సల భక్తిరసమని జెప్పుదురు. కృష్ణుఁడును, అతని గురువర్గమును ఈ రసమునకు ఆలంబనములు.

విభావము.

శ్యామాంగ సుందరుఁడును, సర్వసల్లక్షణ యుక్తుఁడును, మృదువైనవాఁడును, ప్రియవాగ్మియు, సరళ స్వభావము గలవాఁడును, లజ్జాశీలుఁడును, వినయము గలవాఁడును, మాన్యమానకరుఁడును(Payer of respect), దాతయునగు కృష్ణుఁడు ఏతద్గుణాన్వితుఁడై ఈ రసమునకు విభావమగుచున్నాఁడు. పుత్రాదిభావములు వహించుటచే కృష్ణుఁడు ప్రభావ శూన్యుఁడగుచు గుర్వనుగ్రహభాజనుఁడను భావము ధరించి విభావత్వలాభము నొందుచున్నాఁడు.

గురుజనులును, లాలనపాలనము లొనర్చువారును, కృష్ణునికంటె అధికులే అగుచున్నారు. వారు కృష్ణునికి శిక్ష యొసంగుట అనునది ఈ భావములన్నిఁటికి ఆలంబన స్వరూప మగుచున్నది. వ్రజరాణియు, వ్రజేశ్వరుఁడును, రోహిణియు, బ్రహ్మ ఎవరి పుత్రులను హరించెనో వారల తల్లులును, దేవ

ముద్దు పెట్టుకొనుట, బిగియారఁ కౌఁగిలించుట, పేరుపెట్టి పిలుచుట, తనను, తన మిత్రులను చీకొట్టుట, అనునవి అన్నియును వత్సలరసమున సాధారణ కార్యములు. స్తంభాదులగు ఎనిమిదియు, స్తన్యస్రావము — ఈ తొమ్మిదియు వత్సలరసమునందలి సాత్త్విక వికారములు.

స్థాయీభావము

ప్రీతి భక్తిరసమునందు చెప్పఁబడినవన్నియును, వానితో అపస్మారము కలసి ఈ రసమునకు వ్యభిచారీభావము లగుచున్నవి. అనుకంపకు పాత్రుఁడగు వానియెడల అనుకంప జూపువానికి కలుగు సంభ్రమరహితమగు రతియే వాత్సల్యమనఁబడుచున్నది. వాత్సల్యమే ఈ రసమునకు స్థాయీభావము. యశోద మున్నగు వారలయొక్క వాత్సల్యరతి స్వభావ సిద్ధముగ ప్రౌఢమగుచున్నది. ఈ రతి ఒకప్పుడు ప్రేమతుల్యమును, ఒకప్పుడు స్నేహమయమును అగుచు, ఒకప్పుడు రాగ రూపమున ప్రకాశించును.

కృష్ణునితో ఎడఁబాటు కలిగిన కాలమందు అనేకములగు వ్యభిచారీభావములు ఉదయించినను, ఉచితమాత్రము కేవల చింత, విషాదము, నిర్వేదము, జాడ్యము, దైన్యము, చపలత్వము, ఉన్మాదము, మోహము అనువానియొక్క ఉదయమే చెప్పఁబడుచున్నది.

వత్సలరసవైభవమునకు నివ్వెఱపడి పండితులు ఈ రసమునే ప్రధానరసముగ వర్ణించియున్నారు. ఈ రసమునకు వత్సలత్వమే స్థాయీభావము; మఱియు పుత్రాదిభావనోదయమే ఆలంబనము.

కృష్ణరతి అనుభవనీయము కానప్పుడు ప్రీతిరసమునకు పుష్టిలాభము కలుగదు. అట్టియెడ సఖ్య

వత్సలరసోత్కృష్టత

రతి తిరోహితమగును. కాని వాత్సల్య రసమునందు అట్టి అనుభవము లేకున్నను ఏమియు నష్టములేదు. ఇదియే వాత్సల్యరసముయొక్క ఉత్కృష్టతావస్థ అగుచున్నది. ఈ మూడు రసములును పరమాద్భుతములైనను కొన్నికొన్ని స్థలములయందు రస సంకులత్వము చూపట్టుచున్నది.

బలదేవుని సఖ్యప్రీతి వాత్సల్యరస సంకులము. యుధిష్ఠిరుని వాత్సల్యదాస్యములు సఖ్యరసమిశ్రము లగుచున్నవి. ఆహుకప్రభృతులగు గోపకులదాస్యము వాత్సల్య మిశ్రితము. గోపవృద్ధుల వాత్సల్యము సఖ్య మిశ్రమము. నకులసహదేవుల యొక్కయు, నారదాదుల యొక్కయు సఖ్యము దాస్య మిశ్రమము. శివ, గరుడ, ఉద్ధవాదుల దాస్యము సఖ్య మిశ్రమము. అనిరుద్ధుడు మొదలగు కృష్ణుని మనుమల భావము కూడ అదేవిధమున మిశ్రితమే. ఇతర భక్తులయందుకూడ ఇట్టిభావ మిశ్రమమే గోచరించుచుండును.

ప్రీతి, ప్రేయ వత్సల రసములు ఆయా రసములను ఆశ్రయించిన వారలకు అవి సర్వోత్తమములే అయినను, ముఖ్యరసమనుచు ఏ మధుర రసము చెప్పబడుచున్నదో, దానికి సహాయ రూపముననే ఈ మూడు రసములును కార్యాచరణ మొనర్చును. ఇది ముందుముందు స్పష్టీకరింపబడును.



# సప్తమధార

## మధుర భక్తి రసము

అధికారముగల జీవులకు ఉపయోగించునను తలంపుతో ఇపుడు నేను మధుర రసముయొక్క తాత్త్విక మహిమను వర్ణింపఁబోవుచున్నాను. నాచే రచింపఁబడిన "జైవ ధర్మము" అనెడి గ్రంథమందలి ముప్పది యొకటవ అధ్యాయమున ఈ రసమునకు సంబంధించిన విజయునకును, శ్రీమద్గోపాల గురుగోస్వామికిని జరిగిన ఏ ప్రశ్నోత్తరములు కలవో అవియే ఇచట ఎత్తివ్రాయుచున్నాను. పాఠక మహాశయులు సమాహిత భావముతో బాగుగ విచారించి యీ రసమునందు ప్రవర్తింపనగును.

మధుర రసము.

విజయకుమారుఁడడుగుచున్నాఁడు :—

"ప్రభూ! రసము లన్నిఁటిలో మధురరసము అతిరహస్యోత్పాదక రసముగ చెప్పఁబడుచున్నది. అది అట్లు చెప్పఁబడుట యుక్తముగనే తోఁచుచున్నది. శాంత దాస్య సఖ్య వాత్సల్య రసములందుగల గుణములన్నియు మధుర రసమునందు నిత్యవర్తమానము లగుటచేతను, మఱియు ఆయారసములందు ఏ చమత్కార లక్షణము అస్పష్టముగఁ దోఁచుచున్నదో, అదియుకూడ ఈ మధుర రస

మధుర రసము సర్వోచ్చరసము.

మున చక్కగ నెలకొని యుండుటచేతను, సర్వరసములకు పై రసమే మధుర రసమని చెప్పుటలో సందేహమేమున్నది? నివృత్తి మార్గావలంబులగు వారల హృదయము శుష్కమగుటచే వారలకు మధురరసము మిక్కిలి ఉపయోగకరముగనుండదు. మఱియు జడమునందు సదా ప్రవర్తించు వారలకు జడ విలక్షణమగు ధర్మము దురూహముగనే ఉండును. కావున వ్రజమునందలి మధుర రసము జడధర్మమునకు సంబంధించిన శృంగారరసముకంటె అన్నివిధములచేతను విలక్షణమైనదను విషయము వీరికి తెలియునది కాదు. ఇట్టి అపూర్వ రసము అత్యంత హేయమగు స్త్రీ పురుష గత రసముతో ఎట్లు సమాన మగుచున్నది? ''

గురుగోస్వామి యిట్లు చెప్పుచున్నాఁడు :—

"నాయనా! విజయా! జడమునందు ఏ విచిత్రతా సముదాయము కలదో. అది అంతయు చిత్తత్వ మందలి విచిత్రతా సముదాయము యొక్క ప్రతిఫలనమే అని నీవు లెస్సగ నెఱుంగుదువు.

జడము చిత్ప్రతిఫలనమే.

"జడ జగత్తు చిజ్జగత్తుయొక్క ప్రతిఫలనమే. ఇందలి రహస్యమేమనఁగా ప్రతిఫలనము స్వభావసిద్ధముగ విపర్యయ ధర్మమునే కలిగి యుండును. ఆదర్శమందు ఏది సర్వోత్తమముగ నుండునో, ప్రతిఫలనమందు అది సర్వాధమమై యుండును. ఆదర్శమందు ఏది మిగుల నిమ్నస్థితియందుండునో, ప్రతిఫలనమందు సర్వోచ్చ స్థితియందుండును.

"అద్దమునందు ప్రతిఫలించు అంగప్రత్యంగములయొక్క విపర్యయభావమును తిలకించినచో ఈ విషయము సహాజముగఁ దేటఁబడఁగలదు. పరమవస్తువు తన అచింత్యశక్తి కారణముగ ఆ శక్తియొక్క ఛాయయందు ప్రతిఫలించి జడ సత్తారూపమున వ్యాప్తినొందెను. ఈ పరిణామము తాత్త్వికముగ శుద్ధమైనదే అయినను జడమునందు పరమవస్తువుయొక్క ధర్మములు విపర్యయములుగనే తోఁచుచుండును కావున పరమవస్తుగతమగు పరమ ఉపాదేయరసము ఇదే విధముగ జడమునందు హేయరస స్వరూపము వహించి విపర్యస్థ ధర్మమును పొందెను.

రస విచిత్రత

"పరమవస్తువునందు ఏఅద్భుత విచిత్రతా గతసుఖము కలదో, అదే పరమవస్తువునందలి రసము. ఆ రసము జడమునందు ప్రతిఫలించుటచే జడ బద్ధుఁడగు జీవుఁడు విచారము సలిపి నిరుపాధికమగు వస్తు వైచిత్ర్యమందు ఉపాధికల్పన మొనరించును నివృత్త నిర్విశేష ధర్మమును పరమ వస్తువునందుచేర్చి విచిత్రత అంతయు జడధర్మము కలదే అని ఊహించును నిరుపాధికమగు స్థితినిగాని, ఆ స్థితికి సంబంధించిన ధర్మమునుగాని అతఁడు తెలిసికొనఁ జాలకుండును. జడవిచారవాదముచేయు వారలకు పట్టునట్టిగతి యిట్టిదే.

"వాస్తవముగ పరమవస్తువే రసరూపతత్త్వము. ఆ తత్త్వమునందు అద్భుతమగు వైచిత్ర్యము కలదు. ఆవైచిత్ర్యమంతయు జడరసమునందు ప్రతిఫలించుటఁబట్టి మనము జడ

రసము నందలి విచిత్రతనే ఆధారముచేసికొని దానియందలి తుచ్ఛత నుజ్జగించుచు అతీంద్రియ రసమును అనుభవింప నగును.

"చిద్వస్తువునందు ఏరస విచిత్రత కలదో అది యిదే విధమున సంగ్రహింపఁబడుచున్నది. చిజ్జగత్తునందు అత్యంత నిమ్న భాగమున శాంతధర్మగతమును, శాంతరస రూపమును అగు హరధామము, అనఁగా, నిర్గుణ బ్రహ్మలోకము కలదు. దాని పై భాగమున దాస్యరసము, అనఁగా, వైకుంఠతత్త్వము కలదు. దానికిపైఁగా, సఖ్యరసము, అనఁగా, గోలోకస్థ సఖ్య రసము కలదు. దానికిపైఁగా, వాత్సల్యరసము, అనఁగా, గోలోకస్థ పితాలయ రూపమును, నంద యశోదలచే అనుభవ నీయమును అగు రసము కలదు. అన్నిఁటికిని పై భాగమందు మధురరసము, అనఁగా, గోపగోపికా స్థానము కలదు.

"జడమునందు చూచితిమేని మధురరసము తల క్రిందులై అన్నిఁటికంటె అట్టడుగున నుండును. దానికి పై భాగమందు వాత్సల్యరసమును, దానికిపైఁగా సఖ్యరస మును, దానికిపైఁగా దాస్యరసమును, అన్నిఁటికిని పై భాగ మందు శాంతరసమును ఒప్పుచుండును. జడధర్మస్వభావమునే ఆశ్రయించి విచారణసలుపు వారలు అప్రాకృత మధురరసము హేయము, లజ్జాకరము, హీనమునగు స్వభావము గలదానిగ సిద్ధాంతీకరింతురు. చిజ్జగత్తునందు ఈ రసము శుద్ధము, నిర్మలము, అద్భుత విధమున మాధుర్య పరిపూర్ణము అగు చున్నది.

"చిజ్జగత్తునందు కృష్ణుని యొక్కయు, తద్వివిధశక్తి పరిణామరూపులగు స్త్రీపురుషుల యొక్కయు సమ్మేళనము అత్యంత పవిత్రమును, తత్త్వమూలమును అగుచున్నది. జడజగత్తునందు ఏ జడ ప్రత్యాయిత వ్యవహారము కలదో, అది నలుగురిలో నగుఁబాటు కలిగించునదియును, లజ్జాకర మగునదియును అగుచున్నది.

"విశేషమేమన, కృష్ణుఁడే ఏకమాత్ర పురుషుఁడు. మఱియు చిత్ సత్వములగు స్త్రీ పురుష రూపములన్నియు ప్రకృతిరూపములుగ, అనఁగా, స్త్రీరూపములుగ భావింపఁబడుట ధర్మమునకు ఎంతమాత్రము విరోధము కాదు.

కృష్ణుఁడొక్కఁడే భోక్త; జీవుఁడు భోగ్యపదార్థము.

"జడజగత్తునందు ఒక జీవుఁడు భోక్తయు, ఒక జీవుఁడు భోగ్యము అను వ్యాపారము కలిగియుండుటచే అది మూల తత్త్వమునకు విరుద్ధమగుచు లజ్జకును, ఏవకును ఆస్పదమగుచున్నది. తాత్త్వికముగ ఒక జీవుఁడు వేఱొక జీవుని భోగించువాఁడు కాఁడు. సకల జీవులును భోగ్య పదార్థములును, కృష్ణుఁడొక్కఁడే భోక్తయు నగుచున్నారు. జీవుని నిత్య ధర్మమునకు విరుద్ధమగు వ్యాపారము అవశ్యముగ లజ్జకును, ఏవకును ఆస్పదమగు ననుటలో సందేహ మేమున్నది?

"చూడుము. ఆదర్శ ప్రతిఫలన విచారమందును, జడీయ స్త్రీ పురుష వ్యవహారమందును నిర్మలమగు కృష్ణలీలయొక్క సాదృశ్యమునే అవశ్యము భావింపనగును. అయినను ఇందులో

ఒకటి అత్యంత హేయమును, వేఱొకటి మిక్కిలి ఉపాదేయ మును అగుచున్నది."

విజయుఁడనుచున్నాఁడు :—"ప్రభూ! మీరు నన్ను కృతార్థునిగ నొనర్చితిరి. తేనె లోలుకు తము సిద్ధాంత వాక్యములు నా స్వాత స్సిద్ధ విశ్వాసమును దృఢపఱచి సంశయ వినాశన మొనర్చెను. చిజ్జగత్తునందలి మధుర రసస్థితిని నేను లెస్సగఁ దెలిసికొనఁ గలిగితిని. ఆహా! ఏమి మధుర రసము! దాని నామము ఎంతటి మాధుర్యమును ప్రకటించుచున్నదో, దాని అప్రాకృతభావముకూడ అంతటి పరమానంద జనక ముగ నున్నది. ఇటువంటి అద్భుతమగు రసముండగా ఎవరు శాంతరస సుఖమును మాత్రము అభిలషింతురో వారికంటె దౌర్భాగ్యులు ఇంకెవ రుందురు? ప్రభూ! నిగూఢమగు మధురరసముయొక్క వర్ణనము వినుటకు నేను ఉవ్విళ్ళూరు చున్నాను. కావున నన్ను అనుగ్రహింపుఁడు."

శ్రద్ధాసహితమగు వ్రజలీలా విచారము

భక్తుఁడఁవగు నో పాఠకమహాశయా! తత్త్వవేత్తయగు విజయకుమారుని వలెనే నీవుకూడ అప్రాకృత సౌందర్యమును తెలిసికొని దానియందు విశ్వాసరూపమగు శ్రద్ధను వహింపుము. అట్టి శ్రద్ధతోఁ గూడినవాఁడవగుచు వ్రజలీలా విచారము నీవు ఎంతవఱకు చేయఁగలుగుదువో, అంతవఱకు నీ అప్రాకృత భావము నీయందు దుదయింపఁగలదు.

గురుగోస్వామి విజయునితో అపుడు ఇట్లను చున్నాఁడు:—"నాయనా! చెప్పెదను.

ఆలంబనము

వినుము. కృష్ణుఁడే మధుర రసమునకు విషయరూప ఆలంబనము. మఱియు, కృష్ణ వల్లభగణమే ఆశ్రయరూప ఆలంబనము.

నవ జలధర వర్ణుఁడును, సురమ్యుఁడును, మాధుర్యమయుఁడును, సర్వసల్లక్షణ యుక్తుఁడును, బలిష్ఠుఁడును, నవ యౌవనుఁడును, సువక్తయు, ప్రియభాషియు, బుద్ధిమంతుఁడును, ప్రతిభాన్వితుఁడును, ధీరుఁడును, విదగ్ధుఁడును, చతురుఁడును, సుఖియు, కృతజ్ఞుఁడును, దక్షిణుఁడును, ప్రేమ వశ్యుఁడును, గంభీరుఁడును, శ్రేష్ఠుఁడును, కీర్తిమంతుఁడును, రమణీ జన మనోహరుఁడును, నిత్యనూతనుఁడును, అతుల్య కేళీ సౌందర్యశాలియు, ప్రియతముఁడును, వంశీవాదన శీలుఁడును అగు కృష్ణుఁడే విషయరూప ఆలంబనము.

వాని పదకాంతి దర్శనముచే కోటి మన్మథుల గర్వము కూడ దూరీభూతమగును. వాని కటాక్షము అందఱి చిత్తములను మోహపఱచును. కృష్ణుఁడే యౌవనస్త్రీలయొక్క భాగ్యఫల రూపమగు దివ్యలీలానిధి. అప్రాకృతములగు రూపములును, గుణములును గల కృష్ణుఁడే ఏకమాత్ర నాయకుఁడు. భక్తిపూతమగు చిత్తమునందు అహరహము కృష్ణస్ఫూర్తి లభింపఁగలదు. చెప్పుము విజయా! శుద్ధ సత్త్వమునకును, మిశ్ర సత్త్వమునకును గల భేదమేమి ?

శుద్ధజీవుఁడు శుద్ధ సత్త్వమయుఁడు

విజయుఁడు ప్రణతుఁడై యిట్లు మనవి చేయుచున్నాఁడు :— "దేనికి అస్తిత్వ లక్షణము కలదో అది సత్త అనఁబడుచున్నది. స్థితి సత్తయు, రూప సత్తయు, గుణ

అది ఎంతవఱకు ఉదయించునో, అంతవఱకుమాత్రము జీవు నికి స్వస్వరూపలాభము కలుగును. ఇట్టి లాభఫలము ఏదే నొక జ్ఞానచేష్ట చేతగాని, కర్మచేష్ట చేతగాని కలుగునట్టిది కాదు.

శరీరమునకు మలినము అంటినచో అదివేరొక మలిన పదార్థముచే చక్కఁబడదు. జడకర్మమే మలము. ఆమలము ఏ విధమునఁ దొలఁగింపఁ బడఁగలదు?

వ్యతిరేక జ్ఞానము అగ్నివంటిది. అది మల దూషిత సత్త్వమును తగులఁకొనినచో మలము నేకాక సత్త్వమునుకూడ అది నాశనము చేయును. కావున మలము తొలఁగుటచే కలిగెడి సుఖము దాని మూలమున ఎట్లు కలుగఁగలదు? వాస్తవముగ గురు కృష్ణ వైష్ణవజన కృపా మూలకమగు భక్తి చేతనే శుద్ధసత్త్వ ముదయించుచున్నది. శుద్ధ సత్త్వమే హృద యమునకు ఉజ్జ్వలత కలిగించును. ప్రభూ! ఇఁక సెలవిండు. నాయకులు ఎన్ని విధములు?

గురుగోస్వామి చెప్పుచున్నాడు :-

కృష్ణుని చతుర్విధ నాయకత్వము

"విజయా! కృష్ణుఁడు ధీరోదాత్త, ధీరలలిత, ధీర శాంత, ధీరోద్ధత రూపములగు నాలుగు విధములగు నాయకత్వమును ప్రకటించు చున్నాఁడు. ఆ చతుర్విధ నాయకత్వముచే తాను పతి, ఉపపతి అను ద్వివిధభేదమునొంది లీలా ప్రకటన మొనర్చుచున్నాఁడు."

విజయుఁడపుడు అడుగుచున్నాఁడు :-

"ప్రభూ! కృష్ణుని పతిత్వము, ఉపపతిత్వము ఎటు వంటివి ?"

గోస్వామి అనుచున్నాఁడు :-

"ఇది మిగుల రహస్యమగు విషయము. అసలు చిద్వ్యాపారమే ఒక రహస్యమగు మణి. అందులో పారకీయ మధురరసము అట్టి మణులలో కౌస్తుభమణి వంటిది. పరతత్త్వమందు నిర్విశేషభావమును చేర్చినచో రసమెట్టిదియు ఉదయింపనేరదు. "రసో వై సః" అనునట్టి వేదవాక్యములన్నియు వృథఅగును. నిర్విశేషభావమందు సుఖము బొత్తుగ లేకుండుటచే అది అనుపాదేయమగుచున్నది. సవిశేషభావము ఎంతవఱకు ప్రకాశించునో అంతవఱకు రస వికాసము కలుగుచునే ఉండును. రసమే ముఖ్యతత్త్వమని తెలియనగును.

పారకీయ రసము

"నిర్విశేష భావముకంటె కించిన్మాత్రమగు ఐశ్వర్య సవిశేషభావమే ఉత్కృష్టమగుచున్నది. శాంతరసమునందలి ఈశ్వర భావముకంటె దాస్యరసమునందలి ప్రభుభావము శ్రేష్ఠము. సఖ్యభావమందు అంతకంటె ఉత్కృష్టమగు రసము కలదు. వాత్సల్య రసమునందు అంతటికి అధికమగు రసోత్కర్ష కలదు. మధుర రసమందు వాత్సల్యరసముకంటె ఉత్కృష్టమగు రసస్థితి గలదు. ఈ రసములన్నిఁటియందును ఏవిధముగ ఒక రసముకంటె వేఱొక రసముయొక్క ఉత్కర్షత చూడఁబడుచున్నదో, ఆ విధముగనే స్వకీయ మధుర రసమునందు కంటె పారకీయ మధుర రసమునందు అధికమగు ఉత్కర్ష చూడఁబడుచున్నది.

ఆత్మారామత, లీలారామత

"ఆత్మ తత్త్వమనియు, పరతత్త్వమనియు తత్త్వము రెండు విధములు. ఆత్మనిష్ఠాధర్మము నుండి ఆత్మారామత సంభవించుచున్నది. దాని యందలి రసమునకు వేఱొకసాయము లేనందున అది రసమనిపించుకొనదు. కృష్ణుని ఆత్మారామతా ధర్మము ఎట్లు నిత్యమో, లీలారామతా ధర్మముకూడ అదేవిధముగ నిత్యమగుచున్నది. విరుద్ధ ధర్మములను సమంజస మొనర్పఁగల పరమ పురుషునకు ఇది యొక స్వాభావిక ధర్మమగుచున్నది. కృష్ణ తత్త్వమందు ఒక కేంద్రమందు ఆత్మారామతయు, తద్విపరీత కేంద్ర మందు లీలారామతయొక్క పరాకాష్ఠారూపమగు పారకీయ తయు ఒప్పుచుండును.

"నాయక నాయికలు తమలో ఒకరికొకరు మిక్కిలి అపరిచయస్థితియందున్నను రాగమూలమున వారికి ఎప్పుడు కలయిక సంభవించుచున్నదో, అప్పుడు ఉప్పతిల్లెడు అద్భుత రసమునకే పారకీయ రసమని పేరు. ఆత్మారామతవంక ఆకర్షింపఁబడినచో రసము క్రమముగ శుష్కీభూతమగుచున్నది. లీలారామతవంక ఎంతవరకు అది ఆకర్షింపఁబడుచుండునో, అంతవఱకు రసము వికాసము నొందుచుండును.

"కృష్ణుఁడొక్కఁడే ఎచట నాయకుఁడై యుండునో, అచట పారకీయత ఒకప్పుడును నిందాస్పదమై యుండదు. సామాన్యుఁడగు జీవునకు నాయక పదవి ప్రాప్తించినప్పుడే ధర్మాధర్మ విచారము బయలుదేఱును. పారకీయభావము

అచట నితాంత హేయమగుచుండునని పెద్దలు స్థిరపఱచిరి. సామాన్యమగు అలంకారశాస్త్రమునందు ఉపపతికి చెప్పఁబడిన లఘుత్వము ప్రాకృతనాయకులకు సంబంధించినదే కాని అప్రాకృతుఁడగు కృష్ణనాయకునికి సంబంధించి యిట్టి హేయత్వనింద చెప్పఁబడలేదు. ఇట్లని శ్రీరూపగోస్వామి చెప్పుచున్నాఁడు.

పురవనితాగణము స్వకీయులు; వ్రజవనితాగణము తఱచుగ పారకీయులు

"కన్యయొక్క పాణిగ్రహణము ఎవఁడు చేయునో వాఁడు "పతి" అనఁబడుచున్నాడు అనురాగముచే ఉత్తేజితుఁడగుచు ఎవఁడు పారకీయ నాయికను పొందుటకొఱకు వివాహ విధిరూపమగు ధర్మమును ఉల్లంఘించి తన్నాయికాప్రేమ సర్వస్వుఁడగునో అట్టివానిని పండితులు "ఉపపతి" అని చెప్పెదరు. ఏ ఆఁడుది ఐహికాముష్మిక ధర్మములను ఒప్పరికించి వివాహ విధి నపహాసించుచు తన ఆత్మను పరపురుషునికి సమర్పించునో, ఆమె "పరకీయ" అనఁబడుచున్నది.

"కన్య, పరోఢ అను భేదముచే పరకీయ ద్వివిధమగుచున్నది. పాణిగ్రహణముచే సంగ్రహింపఁబడి పతి ఆజ్ఞలను పరిపాలించుట యందు తత్పరత కలిగి పాతివ్రత్య ధర్మము నుండి చలింపని స్త్రీని "స్వకీయ" అందురు.

"కృష్ణుని పురవనితాగణము స్వకీయలును, వ్రజవనితాగణము తఱచుగ పారకీయులును అగుచున్నారు."

విజయుని యొక్కయు, గోపాలగురు గోస్వామి యొక్కయు కథోపకథనమందు అచ్చటచ్చట కొంచెము కొంచెము విడిచిపెట్టి యింతపర్యంతమే యిచట సంగ్రహింపఁ బడుచున్నది.

గోపికల పారకీయత్వము దోషరహితము.

స్వకీయలును, పారకీయలును అగు కృష్ణవనితలకు అప్రకటలీలయందు ఎట్టి స్థితి కలదో, అది యిచట వ్యక్తీకరింపఁ బడుచున్నది. అప్రకటలీల గోలోకమందు నిత్యవర్తమానమై యుండును. భౌమవ్రజమందు దైనందిన నిత్యలీల ఎట్లు వర్తమానమైయుండునో, గోలోకమందుకూడ అట్లే యుండును. గోలోకలీలను దర్శించెడి అచ్చటి ద్రష్టలందఱును మాయాతీతులగుటచే వారలకు గుణాతీతమగు నేత్ర మొప్పుచున్నది. ప్రపంచమందలి నిత్యలీల గోలోక లీలవంటిదే అయినను ఇచ్చటి ద్రష్టలయొక్క నేత్రములును, కర్ణములును, మాయాగుణముచే కప్పఁబడి యుండుటచే ఆ దర్శన దోషకారణముగ వారు కించిన్మాయా ప్రత్యాయితములగు భావములనే చూడఁ గలిగి యుందురు. గోలోకమున పారకీయమగు ఏ నిత్యాభిమానముకలదో, అది ప్రపంచమందు వాస్తవముగ ప్రాకృతవిధముననే గోచరించును.

కృష్ణలీలయందు ఏవిధమగు హేయత్వముగాని, జడత్వముగాని లేదు. కాని మన గుణమయములగు ఇంద్రియములకు అట్టి హేయత్వ జడత్వములు అవశ్యముగ గోచరించుచుండును. ఈ విషయము కృష్ణుఁడు ఈ ప్రపంచమునకు అవతరించిన గోపగణమునకు విశదముగఁ గనఁబడెను.

గోపికలయొక్క పారకీయత్వమంను కొంచెమైనను లజ్జావిషయముకాని, దోషముగాని లేదు. ఏమన సామాన్య పార్థివాలంకారికుల మతానుసారము చేయఁబడు పరదార నిందగాని, వేశ్యానిందగాని వారియందు వినరాదు. మఱియు, అట్టినిందలు వారలయెడల వర్తింపవు.

గోకుల సుందరీ జనము కృష్ణునియొక్క నిత్యశక్తి స్వరూపులగుటచే వారలు గోలోకమందు ఏ పారకీయరస మును గ్రోలుచున్నారో ఆ రసము సర్వోత్కృష్టరసమే అగు చున్నది. ఆపరమ రసాస్వాదనమును ఈ జగత్తున ప్రవర్తింపఁ జేయవలయునను తలఁపుతో కృష్ణచంద్రుఁడు తన గోప సుందరులను గోలోకమునుండి యిచటికి గొనితెచ్చెను. ఇందులో ఏమిదోషము కలదు ?

కృష్ణుఁడు ప్రాకృత నాయకుఁడుకాఁడు. జీవులకు మంగళమొనఁ గూర్చుటకే తానిట్లు చేయుచున్నాఁడు. అట్లు కానిచో జీవుఁడు ఎట్లు ఈ మధుర రసాస్వాదనము ఒనర్ప గలిగి సర్వోత్తమ రసలాభమునకు యోగ్యుఁడై యుండఁ గలఁడు ? తాను గోపియగుచు మధురరసమూలమున కృష్ణుని సేవించుటే భక్తునికర్తవ్యము. తాను కృష్ణుఁడగుచు ఎవఁడు ఈ రసమును ఆస్వాదించునో, అట్టివాఁడు శీఘ్రముగ నరక మందే అవశ్యము పడును. శఠులును, ధూర్తులును, వంచన పరాయణులును అగువారలే యిట్టి అపరాధమును చేయుదురు.

గోలోక దర్శనమునకు అధికారు లెవరు ?

కోటానకోటి ముక్తులయందు ఎవఁడో ఒకఁడు భగవద్భక్తుఁడుగ ఉండుట కూడ

దుర్లభమే. ఐశ్వర్యపరు లగు భక్తులు గోలోకదర్శనము చేయఁజాలరు. వారలు జడముక్తు లగుచు వైకుంఠమందుండి తమ తమ భావములకు అనురూపుఁడగు ఐశ్వర్యమూర్తిని అచట సేవించుచుందురు. వ్రజరసమునందు కృష్ణభజనము చేయువారలలో ఎవరిపై కృష్ణునికి కృప కలిగి మాయా బంధమునుండి ఎవరి నుద్ధరించునో అట్టి వారలకే గోలోకము ప్రత్యక్షమగుచున్నది. వస్తు సిద్ధినొందిన భక్తులు కృష్ణ కృపచే సాక్షాత్తుగ గోలోకమునకే కొని పోఁబడుచున్నారు. స్వరూప సిద్ధినొందిన భక్తులు భౌమ వ్రజమందే గోపికాభి మానముతో నివసించుచుందురు.

అత్యంత తమోమయుఁడగు వ్యక్తి వ్రజభజన కాల మందు సమస్తమును జడమయముగనే చూచుచుండును. రజో గుణ సంపన్నుఁడగు వ్యక్తికి, అనగా సాధకునకు, అంతకంటె మేలగు దర్శన లాభ మబ్బును. సత్త్వగుణసంపన్నుఁడగు భక్తుఁడు ఇచట గోకులమందే గోలోకాభాసమును అను భవించును. నిర్గుణుఁడగు వ్రజభక్తుఁడు గోపీదేహమునొంది గోలోక ప్రాప్తినొందును.

మాయాప్రత్యాయితభావములు ఎంత వఱకు దూరము లగుచుండునో, గోలోకము అంతవఱకు స్పష్టీకృతమగు చుండును. యశోదా ప్రసవము, కృష్ణుని పురిటియిల్లు, అభి మన్యుఁడు, గోవర్ధనుఁడు మున్నగు వారలతో నిత్యసిద్ధలగు గోపికలు వివాహమాడుటచే కలిగెడి పారకీయాభిమానము మిగుల స్థూల రూపమున వ్రజమందు చూడఁబడుచున్నవి.

ఇవన్నియు యోగమాయా నిర్మితములును, మఱియు, అతి సూక్ష్మమగు మూల తత్త్వమునందు సంయోజితములును అగుచున్నవి. ఇవి కొంచెమైనను అసత్యములు కావు. గోలోకమందు ఎట్లున్నవో అట్లే యిచటగూడ ఒప్పు చుండును. చూచువారల ప్రపంచదృష్టి ననుసరించి భౌమ వ్రజమున వాని స్థూలోదయము గోచరించుచున్నది. గోలోక మందు ఆయా తత్త్వములయొక్క రసపోషకాభిమానము మాత్రము నిత్యవర్తమాన మగుచుండును.

అష్టకాలలీల

గోపికాభిమానముతో అష్టకాలలీలా సేవయొక్క సాధన మొనర్చువారు భౌమవ్రజప్రతీతినే అవలంబించు చున్నారు. తత్సాధన మందు కృష్ణకృపాలాభము వారలకు ఎంతవఱకు కలుగునో, అంతవఱకు వారిసేవా పారిశుద్ధ్యము తనంతటతానే కలుగు చుండును. మహాప్రళయమందు వ్రజలీల ఉండునా? అని అడిగితివేని దానికి ఉత్తరమేమనిన, ఆసమయమందు సర్వ లీలయు గోలోకమందే ప్రకాశించుచుండును. అష్టకాల సాధనమందే దైనందినమగు నిత్యలీల లభించుచున్నది. స్థితి కాలమందు వ్రజలీల చక్రమువలె ఒక్కొక్క బ్రహ్మాండ మందు భ్రమించుచుండును. మహాప్రళయకాలమందు సమస్తమును గోలోకమునే చేఱుకొని అచటనే విరాజిల్లు చుండును. అప్రకట లీలాకాలమందు వ్రజధామము జీవుని సాధనమునకు అనుకూలించుచు వర్తమానమగుచుండునే కాని తిరోహితము కాఁజాలదు. భౌమమండలమందు చక్రమువలె

భ్రమించుచుండును. ఈ కథయింతవఱకే చెప్పి నిలుపఁబడుచున్నది. ఇఁక ప్రకృత విషయము.

కృష్ణుఁడు తప్ప వేఱొండు నాయకుఁడే లేఁడు.

కృష్ణుని నాయకత్వము

ఆ కృష్ణుఁడు ద్వారకయందు పూర్ణుఁడుగను, మధురయందు పూర్ణతరుఁడుగను, వ్రజమందు పూర్ణతముఁడుగను ఒప్పుచుండును. కృష్ణుఁడు "పతి - ఉపపతి" అను ద్వివిధభేదము కలిగియుండుటచే ఈ మూఁడు మండలములందును ఆఱు విధములుగ వర్తించుచున్నాఁడు. ధీరోదాత్తాది చతుర్విధ భేదములచే ఇఱువది నాలుగు విధము లగుచున్నాఁడు. అనుకూల, దక్షిణ, శఠ, ధృష్టభేదములచే పై ఇఱువది నాలుగు చతుర్గుణమగుచుండ తొంబది ఆఱు ప్రకారములగు నాయకులగుచున్నారు.

స్వకీయ రసమందు కృష్ణనాయకత్వము ఇఱువది నాలుగు ప్రకారములు, పారకీయ రసమందు ఇఱువది నాలుగు ప్రకారములు, వ్రజమందు ఇఱువది నాలుగు విధములగు పారకీయ కృష్ణనాయకత్వము, నిత్యవర్తమాన మగుచుండును. వ్రజనాయకుని ఆలంబనత్వము ఇంతవఱకు సంక్షేపముగ వివరించితిని.

నాయకునకు పంచవిధ సహాయము.

నాయకునకు సహాయమొనర్చువారు చేటులు, విటులు, విదూషకులు, పీటమర్దులు, ప్రియనర్మసఖులు అనుచు అయిదు విధములగుచున్నారు. వీరందఱు నర్మ వాక్య ప్రయోగమందు నిపుణులును, గాఢానురాగము గలవారును, దేశకాలజ్ఞులును, దక్షులును, గోపీప్రసన్నకారు

కటాక్షము, వంశీధ్వని అనునవి స్వయందూతికలు. ప్రగల్భవచన చతురయగు వీరయు, చాటూక్తి చతురయగు బృందయు, వీరిరువురు కృష్ణుని ఆప్తదూతికలు. లింగిని, దైవజ్ఞ, శిల్పకారిణి మున్నగు సాధారణ దూతికలు అనేకులు కృష్ణునికి గలరు.

గోపీగణము

కృష్ణవల్లభలగు గోపీగణము ఈ రసమునకు ఆశ్రయ రూపమగు ఆలంబనము. స్వకీయ, పారకీయ భేదములచే వీరు మరల రెండు విధములు. వ్రజమందు స్వకీయా పరిచయము అస్పష్టముగ నుండును. పారకీయలగు కృష్ణవల్లభలయొక్క విశేష పరిచయమే వ్రజమందు లభించుచున్నది.

వ్రజేంద్ర నందనునియొక్క వ్రజవాసినీ లలనాగణము తఱచుగ పారకీయలై యుందురు. ఏమన, పారకీయల మూలమున తప్ప మఱొక విధముగ మధుర రసమునకు అత్యంత ఉత్కృష్టమగు వికాసము కలుగనేరదు. వివాహ సంబంధము కారణముగ పురవనితలయొక్క రసము మొనవోయినదే అగుచున్నది. శుద్ధ కామసంపన్నమగుటచే వ్రజసుందరులయొక్క రసము అకుంఠితమగుచు కృష్ణునకు అధిక సుఖము కలిగించుచున్నది.

స్త్రీ జనము తమప్రియులయెడ నెఱపు వక్రభావము, ప్రియులకు తమ దుర్లభత్వము ప్రకటించు విధమున వారలను నివారించుట, మున్నగు ప్రతిబంధకత్వ సంఘటనలు–ఇవియే మన్మథునిచేతి ఆయుధ స్వరూపము లగుచున్నవనుచు

శృంగార రసజ్ఞుడగు రుద్రుడు చెప్పుచున్నాడు. విష్ణు గుప్తుడను అలంకారికుడు గూడ ఇదేవిధమున చెప్పి యున్నాడు.

పరోఢలగు వ్రజవాసినీ సుందరులకు ఎప్పుడు కృష్ణునితో భోగించుటకు కోర్కెవొడమెనో, అప్పుడు వారు సర్వాతిశాయిని అగు తనుకాంతి కలిగియుండుటచేతను, తమ సద్గుణవైభవము ప్రకటించుటచేతను సహజముగ ప్రేమ సౌందర్యభరభూషితలే అగుచున్నారు. మహాలక్ష్మ్యాదులగు శక్తులయొక్క రసమాధుర్యము వ్రజసుందరుల రసమాధుర్యమువలె వృద్ధిలాభము నొందజాలదు.

సాధనపర, దేవి, నిత్యప్రియ అను భేదములచే వ్రజసుందరీగణము మూడు విధములగుచున్నారు. సాధనపరలు యౌధికి, అయౌధికి భేదముకలిగి మరల రెండు విధములగుచున్నారు. యూధసంబంధము కలిగియుండుటచే మునిగణము, ఉపనిషద్గణము వ్రజమందు గోపికలగుచు యౌధికు లనబడుచున్నారు. ఏ మునులు గోపాలోపాసకులై కూడ అభీష్టసిద్ధి లాభము పొందజాలకపోయిరో, ఏ మునులు శ్రీరామచంద్రుని సౌందర్యము తిలకించి నిజాభీష్ట సాధనయత్న మొనర్చిరో, అట్టి ఆ మునులందఱును భావసంపన్నులగుచు వ్రజమందు గోపికలై జన్మించిరి. సూక్ష్మ దర్శిత్వముగల మహోపనిషద్గణము గోపికలుగా జన్మించి సాధనపరలైరి.

బ్రహ్మదేవుని ఆజ్ఞననుసరించి ఏ దేవతాస్త్రీలు కృష్ణుని సేవించుటకై వ్రజమందు జన్మించిరో, కృష్ణుడు అంశకళా

పురుషుఁడగుచు స్వర్గమునందు అవతరించినపుడు ఏ దేవతా స్త్రీలు వానిని సేవించిరో, అట్టి స్త్రీలకే వ్రజమందు దేవీ శబ్దము ప్రయుక్తమగుచున్నది. వీరలు రాధికయొక్క ప్రాణ సఖులుగఁ బరిగణింపఁబడుచున్నారు.

గాయత్రి

వేదమాతయగు గాయత్రి గోపికగా జన్మించి కృష్ణ సాంగత్యలాభమునొంది కామగాయత్రి అగుచున్నది. నిత్యసిద్ధులకు సంబంధించిన యోగమాయాకల్పితమగు వ్రజవ్యాపారము దోషరహితమే అగుచున్నది. ఏమన, ఆమాయ జడీయమగు మాయకాదు. యోగమాయఅగు చిచ్ఛక్తియే కృష్ణేచ్ఛ ననుసరించి ఈ వ్రజవ్యాపారమునంతటిని విధించుచున్నది. నిత్యసిద్ధులతో సాలోక్యలాభమునొంది సకలోపనిషత్తులును, గాయత్రియు, దేవీగణమును పారకీయ భావములతో వారితోపాటు కృష్ణ సేవ చేయుచున్నారు.

రాధ, చంద్రావళి అనువారలు ఎవరిలో మిన్నలని చెప్పఁబడుచున్నారో, అట్టి నిత్యప్రియాగణము వ్రజమందు కృష్ణునివలెనే సౌందర్యము, వైదగ్ధ్యము మున్నగు గుణములకు ఆశ్రయులగుచున్నారు. సచ్చిదానంద రూపమగు పరమ తత్త్వముయొక్క ఆనందాంశము ఎపుడు చిదంశమును సంక్షుభిత మొనర్చుచున్నదో, అప్పుడు దానియందు వేఱుపఱుపఁబడిన హ్లాదినీప్రతిభా భావిత లగు శ్రీ రాధిక మున్నగు సకలవ్రజ సుందరులు ఉదయించిరి.

అట్టి ఆ సుందరులతోఁగూడియును, మఱియు, తన రూపమునుండి, అనఁగా, చిత్స్వరూపమునుండి ఏ ఇరువది నాలుగు కళలు ఉదయించెనో ఆ కళలన్నిఁటితోఁగూడియును, అఖిలాత్మభూతుఁడగు శ్రీకృష్ణుఁడు నిత్యమగు గోలోకధామమందు సకల లీలావిరాజమానుఁడై యుండును.

యూథేశ్వరి

స్కాందపురాణమునందును, ప్రహ్లాదసంహిత మున్నగు శాస్త్రములందును రాధ, చంద్రావళి, విశాఖ, లలిత, శ్యామ, పద్మ, శైబ్య, భద్రిక, తార, విచిత్ర, గోపాలి, ధనిష్ఠ, పాలి మున్నగు గోపికల నామములు కనఁబడుచున్నవి. చంద్రావళికి సోమాభ అనెడి మఱియొక పేరుగలదు రాధికకుకూడ గాంధర్వ అను నామాంతరము కలదు.

ఖంజనాక్షి, మనోరమ, మంగళ, విమల, లీల, కృష్ణ, శారి, విశారద, తారావళి, చకోరాక్షి, శంకరి, కుంకుమ మున్నగు వ్రజసుందరులుకూడ లోకప్రసిద్ధులుగనే ఉన్నారు ఈ గోపికలందఱును యూథేశ్వరీ నామము కలవారే.

యూథములు వందలకొలఁది గలవు. ప్రతి యూథమందును ఉత్తమాంగనలు లక్షలకొలఁది కలరు. విశాఖ, లలిత, పద్మ, శైబ్య అనువారు మిక్కిలి ఎక్కువగఁ గీర్తింపఁబడుచున్నారు. యూథేశ్వరీ నామము గల వారలలో రాధ మున్నగు అష్టగోపికలు సౌభాగ్యాతిశయము కలిగియుండుటచే ప్రధాన లనఁబడుచున్నారు. విశాఖ, లలిత, పద్మ, శైబ్య అనువారు యూథాధిపత్యము వహించుటకు విశేష యోగ్యత-

గలవారైనను శ్రీమతి రాధికయొక్క పరమానందమయ భావముచే మోహితలగుచు విశాఖయు, లలితయు శ్రీరాధికకు అనుగత సఖులగుచున్నారు. ఇక్లేపద్మయు, శైబ్యాయు, చంద్రావళికి అనుగత సఖులైరనుచు శాస్త్రములు చెప్పుచున్నవి.

యూథేశ్వరీ నామము కలవారిలో శ్రీ రాధికయే ప్రధానత్వము వహించుచున్నది. ఆమెయొక్క యూథమందు లెక్కలేని లలితాగణములు కలవని చెప్పఁబడు చున్నది. అందు కొన్ని కొన్ని విశాఖాగణములుకూడ కలవని చెప్పఁబడుచున్నది. బహుజన్మ సుకృతఫలము గలవారికే శ్రీమతి లలితాయూథమందు ప్రవేశలాభము కలుగుచున్నది.

శ్రీరాధిక సర్వవిధముల చేతను శ్రేష్ఠురాలు.

రాధ, చంద్రావళి అనెడి యిరువురిలో శ్రీ రాధిక మహాభావ స్వరూప. కావున సర్వవిధములచేతను శ్రేష్ఠురాలు. తాపనీశ్రుతి యందును, ఋక్పరిశిష్ట ప్రకరణమందును రాధా మాధవుల ఉజ్జ్వలత వర్ణింపఁబడినది. రాధిక హ్లాదినీ శక్తియొక్క సారభావము. ఆమె సుష్ఠు కాంత స్వరూపము కలిగియున్నది. పదునాఱు విధములగు శృంగారములతోడను, పండ్రెండు విధములగు అలంకారములతోడను ఆమె సదా కూడుకొనియుండును. కాని ఆ శృంగారములును, అలంకారములును ఆమె తనుకాంతితో ఈడుకావని మాత్రము చెప్పవలసియుండును.

అంగశోభ

చక్కని ముంగురులును, చంచలమగు ముఖకమలమును, దీర్ఘములగు నేత్రములును, వక్షస్థలమునందు అపూర్వములగు పాలిం

ద్లును, సన్నమగు లేఁగౌనును, శోభాయమానమగు స్కంద ద్వయమును, హస్తములయందు రత్నములవంటి నఖములును ఆమెయందు సదా విరాజమానములగుచుండును. ముల్లోక ముల యందును ఇట్టి రూపోత్సవము లేకుండుటచే ఆమె సుష్ఠుకాంత స్వరూప అని చెప్పఁబడుచున్నది.

స్నానము, నాసాగ్రమందు మిక్కిలి మెఱసెడి మణియు, నీలవసనము, కటి భాగమందు నీవియు, కేశములు, చెవుల యందు తాటంకములు, శరీరమందు చందన లేపనము, కేశ మధ్యమున పూలు ముడుచుటయు, మెడయందు పూల దండయు, హస్తమందు పద్మము, నోటియందు తాంబూ లము, చుబుకమున కస్తురిబొట్టు, నేత్రములందు కాటుకయు, చిత్రితములగు చెక్కిళ్లు, పాదములయందు లత్తుక పూఁతయు, నెన్నుదిటిపై తిలకము అను ఈపదునాఱును శృంగారములు, అనగా, దేహశోభలు.

చూడమునందు అపూర్వమగు మణియు, చెవుల యందు బంగారు కుండలములు, నడుమున ఒడ్డాణము, గళ మున సువర్ణపతకము, చెవియొక్క ఊర్ధ్వచ్ఛిద్రమున స్వర్ణ శలాకయు, ముంజేతులయందు కంకణములు, కంఠమున కంఠ హారము, వ్రేళ్ళపై ఉంగరములు, గళమునఁ దారహారము, భుజమున భుజకీర్తులు, కాళ్ళకు రతనపు టందియలు, కాలి వ్రేళ్ళపై ఉంగరములు అను ఈ పండ్రెండు సొమ్ములును శ్రీరాధిక దేహమందు శోభిల్లుచుండును.

సౌభాగ్య రేఖ

కృష్ణునివలె బృందావనేశ్వరి యగు రాధిక కూడ అసంఖ్యములగు గుణము-

లతో ఒప్పుచుండును. వానిలో ప్రధానములగు గుణములు ఇరువదియైదు. ఎట్లన,

1. ఆమె మాధుర్య సంపన్న; అనఁగా, చారుదర్శన.
2. ఆమె నవ వయోవిశిష్ట; అనఁగా, కిశోరవయస్సంపన్న.
3. ఆమె చలాపాంగి; అనఁగా చంచలమగు దృష్టికలది.
4. ఆమె ఉజ్జ్వలస్మిత; అనఁగా, ఆనందమయమగు నవ్వుతో గూడుకొన్నది.
5. ఆమె చారుసౌభాగ్య రేఖాయుక్త; అనఁగా పాదాదులయందు చంద్రరేఖ కలది.
6. ఆమె తన దేహ సౌరభముచే మాధవునికి ఉన్మాదము కలిగించును.
7. సంగీత విస్తారమందు ఆమె అభిజ్ఞ.
8. ఆమె రమ్యముగ మాటలాడును.
9. నర్మవాక్యములు పలుకుటయందు ఆమె దక్షురాలు.
10. ఆమె వినీత.
11. ఆమె కరుణాపూర్ణ.
12. ఆమె విదగ్ధ; అనఁగా చతుర.
13. ఆమె పటిష్ఠ; అనఁగా పాటవము కలది.
14. ఆమె లజ్జాశీల.
15. ఆమె సుమర్యాద కలది; అనఁగా సాధుమార్గము నుండి యించుకయు చలింపనిది.
16. ఆమె ధైర్యశాలిని.

17. ఆమె గాంభీర్యశాలిని.
18. ఆమె సువిలాస.
19. ఆమె మహాభావ పరమోత్కర్ష తర్షిణి.
20. ఆమె గోకులప్రేమ వసతి.
21. ఆమె జగచ్ఛ్రేణీ లసద్యశస్క ; అనగా, ఆమె యశస్సు అనంత జగత్తున వ్యాప్తిచెంది యున్నది.
22. ఆమె గుర్వర్పిత గురుస్నేహ ; అనఁగా, ఆమె గురుజనులకు అత్యంత స్నేహాస్పద.
23. ఆమె సఖీగణ ప్రణయాధీన.
24. ఆమె కృష్ణప్రియావళీ ముఖ్య.
25. ఆమె సంతతాశ్రయ కేశవ ; అనఁగా, కేశవుఁడు సదా ఆమె ఆజ్ఞకు అధీనుఁడై యుండును.

వరాహ సంహిత అనెడి జ్యోతిశ్శాస్త్రమందును, కాశీఖండమందును, మత్స్య,గరుడ పురాణముల యందును, ఆమె సౌభాగ్యరేఖాగణము వర్ణింపఁబడెను. ఎట్లన,

1. ఎడమకాలియందు అంగుష్ఠమూలమున యవరేఖ.
2. దానిక్రిందను చక్రరేఖ.
3. నడిమివ్రేలిక్రిందను కమలము.
4. కమలమునకు క్రింద ధ్వజము.
5. పతాక.
6. నడిమివ్రేలికి దక్షిణమున ప్రారంభించి చరణమధ్యము వఱకు ఊర్ధ్వరేఖ.

7. చిటికెన వ్రేలిక్రింద అంకుశము.

మఱల,

1. కుడికాలియందు అంగుష్ఠమూలమున శంఖము.
2. పాదపార్శ్వమున మత్స్యము.
3. చిటికెన వ్రేలిక్రింద వేదిక.
4. మత్స్యమునకు పైభాగమున రథము.
5. శైలము.
6. కుండలము.
7. గద.
8. శక్తిచిహ్నము.

ఎడమచేతియందు

1. చూపుడు వ్రేలిసంధిమొదలు చిటికెనవ్రేలి క్రింద భాగము వఱకు పరమాయురేఖ.
2. దాని అడుగున అఱచేతిక్రిందనుండి ఆరంభమై చూపుడు బొటనవ్రేళ్ళ నడిమి ప్రదేశము వఱకు వ్యాపించిన అన్యరేఖ.
3. బొటనవ్రేలి క్రిందను మణిబంధమునుండి బయలు వెడలి వక్రగతినొంది మధ్యరేఖతోఁ గలసి చూపుడు బొటనవ్రేళ్ళ నడిమి ప్రదేశమువఱకు వ్యాపించిన మఱియొకరేఖ.
4. వ్రేళ్లకొనలయందు నంద్యావర్తరూపములుగల ఐదు చక్రాకార చిహ్నములు.

—ఇవన్నియు కలసి మొనిమిది అగును.

16. అసి.

17. భృంగారము

అనునవి ఒప్పుచుండును.

ఈ విధముగ వామచరణమందు ఏడును, దక్షిణ చరణమునందు ఎనిమిదియు, వామకరమున పదునెనిమిదియు, దక్షిణకరమున పదునేడును కలసి ఏఁబది చిహ్నములు సౌభాగ్యరేఖ లనఁబడుచున్నవి.

ఇవన్నియు జీవులయందు బిందుబిందు రూపములై నెలకొనియుండును. దేవీప్రభృతులయందు కొంచె మధికపరిమాణమున నుండును. రాధికయందు సమస్తమును పూర్ణరూపమున వర్తించుచుండును. రాధికయొక్క సమస్త గుణములు అప్రాకృతములు. గౌరీప్రభృతులయందు ఈ గుణముల యొక్క శుద్ధత్వముగాని, పూర్ణత్వముగాని లేదు. శ్రీరాధికయందే చమత్కారితయొక్క పరాకాష్ఠ లక్షితమగుచున్నది.

రాధికాయూథము సర్వోత్తమ యూథము.

శ్రీ రాధికాయూథమే సర్వోత్తమ యూథము. ఆ యూథమునందుఁగల సుందరులందరును సర్వసద్గుణ భూషితలై తమ విలాసభ్రమముచే మాధవుని సదా ఆకర్షించుచుందురు.

శ్రీరాధికయొక్క సఖీబృందము, పంచవిధములగు సఖులు.

సఖులు, నిత్యసఖులు, ప్రాణసఖులు, ప్రియసఖులు, మఱియు పరమప్రేష్ఠసఖులు అనుచు ఐదు విధములగు సఖులు శ్రీ రాధికకు గలరు.

కుసుమిక, బృంద, ధనిష్ఠ మున్నగువారు సఖులు.
కస్తూరి, మణిమంజరి, మున్నగువారు నిత్యసఖులు.
శశిముఖి, వాసంతి, లాసిక మున్నగువారు ప్రాణసఖులు.

వీరు తఱచుగ బృందావనేశ్వరియొక్క స్వరూపమును పొంది యుందురు.

కురంగాక్షి, సుమధ్య, మదలాలస, కమల, మాధురి, మంజకేశి, కందర్పసుందరి, మాధవి, మాలతి, కామలత, శశికళ మున్నగువారు ప్రియసఖులు.

లలిత, విశాఖ, చిత్ర, చంపకలత, తుంగవిద్య, ఇందురేఖ, రంగదేవి, సుదేవి అనెడి ఎనమండ్రు, సఖులందఱిలో ప్రధానలగుచు పరమప్రేష్ఠ సఖులుగ పేర్కొనఁబడు చున్నారు.

వీరలు రాధాకృష్ణప్రేమయొక్క పరాకాష్ఠను చవిచూచిన వారగుటచే ఒక్కొక్కచో కృష్ణుని యెడలను, మఱియొక్కచో రాధికయెడలను అధికప్రేమను కనఁబఱతురు.

ఒక్కొక్క యూథమందుగల అవాంతర విభాగము లకే "గణము" లని పేరు.

వ్రజలీలయందు అతిక్షుద్రమును, మాయోపాధికమును అగు వివాహవిధికి స్థానము లేదు. ఆ గోలోక విహారియగు కృష్ణుఁడు తన సంబంధమగు పారకీయ రసమును గోలోకముతోఁగూడ ఈ ప్రపంచమునకు తోడ్కొని వచ్చినంత మాత్రమున గోలోక లలనలయొక్క జడీయపరకీయరసము నిందాస్థానము నొందఁజాలదు.

గోకుల లలనలకు కృష్ణునియందు కేవల నందనందన స్ఫూర్తియే ఒప్పుచుండును. అట్టి నిష్ఠా క్రమమున ఏ సకలభావముద్రలు ఉదయించుచుండునో, అవి అభక్తులగు తార్కికగణము మాట అటుండ వైధభక్తగణమునకు గూడ దుర్గ్రాహ్యములే అగుచున్నవి.

జడరసము, పారకీయరసము.

నాయికలు మూఁడు విధములు :—

(1) స్వకీయ (2) పరకీయ (3) సామాన్య.

చిద్రసమునకు సంబంధించి నేను స్వకీయ పరకీయలను గూర్చియే చెప్పియున్నాను. జడాలంకారికులగు పండితులు వేశ్యలనే సామాన్య నాయికలుగ చెప్పుదురు. వేశ్యలు కేవలము అర్థలోభులు. గుణహీనుఁడగు నాయకుని యందు ద్వేషముగాని, గుణవంతుఁడగు నాయకుని యందు అనురాగముగాని వారికి లేదు. వారల శృంగారమంతయు శృంగారాభాస మాత్రమే.

నాయికల యందలి భేదములు.

మాధురి, సైరంధ్రి, కుబ్జ అనువారలు సామాన్య నాయికలే అయినను ఒకవిధమగు భావయోగ్యత వారికి కలిగి యుండుటచే వారలను పరకీయా సాధరణీ నామములతో పిలుచుచున్నాను. కృష్ణ రూపమును దర్శించి కృష్ణుని దేహమందు చందనము పూయుద మనియెడి కోర్కెయే వారల అప్రాకృత ప్రియభావము. వారల రతి పట్టపుదేవుల రతికంటె తక్కువ జాతిలోనిదే అగుచున్నది.

స్వకీయలు, పారకీయలు అగు ఉభయవిధ నాయికా గణము ముగ్ధా-మధ్యా-ప్రగల్భా భేదములచే మూఁడు విధములగుచున్నారు. మఱియొక లెక్క ప్రకారము కృష్ణనాయికలందఱు పదునైదు విధములగుచున్నారు.

నాయికలందఱును అవస్థాభేదమును బట్టి ఎనిమిది విధములగుచున్నారు.

నాయికల అవస్థా భేదములు.

1. అభిసారిక. 5. విప్రలబ్ధ.
2. వాసకసజ్జిక. 6. కలహాంతరిత.
3. ఉత్కంఠిత. 7. ప్రోషిత భర్తృక.
4 ఖండిత. 8. స్వాధీన భర్తృక.

ముందు చెప్పిన పదునైదు విధములగు కృష్ణనాయికలకు గూడ ఈయెనిమిది విధములగు అవస్థయు గలదు.

కృష్ణనాయిక ప్రేమవశ్యయగుచు కృష్ణుని క్షణకాలమైన విడిచి యుండుటకు సమర్థురాలు కానపుడు అట్టి స్వాధీన భర్తృక మాధవి అని చెప్పఁబడుచున్నది.

ఈ యెనమండ్రు నాయికలలో స్వాధీన భర్తృక, వాసక సజ్జిక, అభిసారిక అను మూఁడు అవస్థలుగల నాయికలును సంతుష్టచిత్తలగుచు అలంకారములు మున్నగు వానిని ధరింతురు.

ఖండిత, విప్రలబ్ధ, ఉత్కంఠిత, ప్రోషితభర్తృక, కలహాంతరిత అనెడి అయిదు విధములగు అవస్థలుగల నాయికలును భూషణములను త్యజించి వామగండమున హస్తము నుంచి ఖేదము చేతను, చింత చేతను సంతప్తలగుచుందురు.

సంతాపము మున్నగునవి కృష్ణప్రేమయందలి చిన్మయ పరమానందము యొక్క విచిత్రతనే ప్రదర్శించుచున్నవి. ప్రేమ తారతమ్యమునుబట్టి నాయిక లందఱును ఉత్తమా - మధ్యమా - కనిష్ఠా భేదములచే మూఁడు విధములగు చున్నారు. కృష్ణుని యెడల ఏ నాయికకు ఎంత పరిమాణ మగు భావము కలిగియుండునో, కృష్ణునికి ఆ నాయికయందు అంత పరిమాణముగల భావము కలిగియుండును

నాయికల సంఖ్య మున్నూట అఱువది

ఉత్తమనాయిక కృష్ణునికి ఒక్కక్షణ కాలము సుఖము గూర్చుటకై తాను అఖిల కర్మలను పరిత్యజించును. కృష్ణునికి క్లేశము కలిగెనను వార్త వినినంతనే ఆమె హృదయము వ్రక్కలగును.

మధ్యమానాయిక యొక్క చిత్తము నాయకుని క్లేశ వార్తవిని నప్పుడు ఒకింత ఖిన్నత్వము నొందును. నాయకునితోఁ గలయుటకు సదా ప్రతిబంధకములనే శంకించు నాయిక కనిష్ఠ అనఁబడుచున్నది. అన్నియు కలిపినచో నాయికల సంఖ్య మున్నూట అఱువది అగుచున్నది.

మొదట చెప్పిన పదునైదు విధములను ఎనిమిదిచే గుణించినచో నూట యిఱువది అగుచున్నది. మఱల దానిని పిమ్మట చెప్పిన మూఁడింటిచే గుణించినచో మున్నూట అఱువది అగుచున్నది. కృష్ణనాయికలకు ఈ సమస్తమును భజన భావములు.

యూథేశ్వరీగణమునకు సుహృదాది వ్యవహార భేదము, అనఁగా, స్వపక్ష, విపక్ష, తటస్థ భేదము కలదు.

కృష్ణదర్శనమందు ఆసక్తిగల నాయికలకు సాయము చేయు దూతికలు స్వయందూతి, ఆప్త దూతి అనుభేదము కలిగి రెండు విధము లగుచున్నారు. అనురాగ మోహిత అగు నాయిక నాయకుని యెడలతాను ఏ భావమును ప్రకటించునో, అదియే స్వయందూతి.

దూతికలు

అభియోగము కాయిక, వాచిక, చాక్షుస భేదములచే మూఁడు విధములగుచున్నది. వ్యంగ్యమే వాచికాభియోగము. అది శబ్దవ్యంగ్యము, అర్థవ్యంగ్యము అనుచు మఱల రెండు విధములగుచున్నది. కృష్ణునితో సాక్షాత్తుగను, మఱియు వ్యపదేశ మూలముగను రెండు విధములు వహించి వ్యంగ్యము కార్యాచరణ మొనర్చును. యాచ్ఞ అనునది స్వార్థ, పరార్థ భేదములచే రెండు విధములగుచున్నది. దీని యందు అపదేశ వ్యపదేశములు కలవు.

విశ్వస్త, స్నేహవతి, వాగ్మిని అనుదూతీగణము వ్రజ సుందరులకు ఆప్తదూతిక లగుచున్నారు. మఱియు వారు అమితార్థ, విసృష్టార్థ, పత్రహారీ భేదములచే మూఁడువిధము లగుచున్నారు. శిల్పకారిణి, దైవజ్ఞ, లింగిని, పరిచారిక, ధాత్రేయి, వనదేవి, సఖి మున్నగువారు కూడ దూతికలుగ గనే ఎన్నఁబడుచున్నారు.

శిల్పకారిణి చిత్రపటములు రచించియు, దైవజ్ఞ అను దూతి రాశీఫలాదులు చెప్పియు, నాయికానాయకులకు సమాగమ మొనఁగూర్తురు. పౌర్ణమాసివలె తాపసాది వేషములను ధరించునది లింగినీదూతి.

లవంగమంజరి, భానుమతి మున్నగు కొందఱు సఖులు పరిచారికా దూతికలుగను, రాధికకు ధాత్రేయీ దూతికలుగను అగుచున్నారు. వనదేవి బృందావనమునకు అధిష్ఠాత్రియగు దేవియే.

సఖీగణము శబ్దవ్యంగ్యము చేతను, అర్థవ్యంగ్యము చేతను దౌత్య మొనరించుచున్నారు. శబ్దమూలకమును, అర్థమూలకమును, అగు వ్యపదేశ ప్రశంసయు, ఆక్షేపణము మున్నగు సర్వప్రకారములగు అభియోగము వారియందు కలదు.

దౌత్యకార్యమునందు నియోగింపఁబడి సఖులు ఏకాంతస్థలమందు కృష్ణుని కలసినప్పుడు కృష్ణుఁడు వారలతోడి సంగమమును ప్రార్థించును. కాని సఖులు దానికి అంగీకరింపరు.

సఖులు చేయు కార్యములు — సఖీగణము చేయుకృత్యములు పదునాఱు విధములు.

ఎట్లన,

1. నాయికా నాయకులలో ఒకరి యెదుట యింకొకరి గుణములు వర్ణించుట.

2. వారిలో ఒకరియందు ఇంకొకరికిగల ఆసక్తిని వృద్ధి పఱచుట.
3. నియమిత కాలమందు నియమిత దేశమున వారి నిరువురను అభిసరింపఁజేయుట.
4. కృష్ణునికి సఖీసమర్పణ మొనర్చుట.
5. నాయికా నాయకులను పరిహాసించుట.
6. వారలను ఊరడించుట.
7. వారలకు నేపథ్య మొనర్చుట, అనఁగా ముస్తాబు చేయుట.
8. వారల మనోగత భావములు ఒకరియెదుట యింకొకరివి వెల్లడించుట.
9. వారల దోషచ్ఛిద్రములను కప్పిపుచ్చుట.
10. తమ భర్తలను వంచించుట.
11. నాయికా నాయకులలో ఒకరియెదుట ఇంకొకరు ఎట్లు వ్యవహరింపవలెనో ఆ శిక్ష వారికి గఱపుట, ఉచితకాలమందు నాయకుని నాయికతో కలుపుట.
12. చామరము, తాళవృంతము మున్నగువానిచే వారిని సేవించుట.
13. ఒక్కొక్కయెడ నాయకుని తిరస్కరించుట.
14. అటులే నాయికనుగూడ తిరస్కరించుట.
15. వారలలో ఒకరివార్తలు ఒకరి కెఱింగించుట.
16. నాయికయొక్క ప్రాణములను కాపాడుటకొఱకు సర్వవిధములచేతను ప్రయత్నించుట.

సఖీజనమండలును రాధికయెడలను, కృష్ణునియెడలను సమాన ప్రేమను గలవారయ్యును, "మేము రాధికయొక్క పరిజన" మనుచు వారిలో ఎవరికి అభిమానము కలదో వారలే సర్వశ్రేష్ఠులు. వారలే ప్రియసఖులుగను, పరమ ప్రేష్ఠసఖులుగను చెప్పఁబడుచున్నారు.

నాలుగు విధములగు సఖీజనము

స్వపక్ష, సుహృత్పక్ష, తటస్థ, ప్రతిపక్షభేదములచే సఖీగణము నాలుగువిధములగుచున్నారు. రసపుష్టిగొఱకే ఈ భేదములు ఏర్పడినవని తెలియనగును. ప్రతిపక్ష వ్యాపారమందు దర్పము, మదము, ఈర్ష్య మున్నగు ఏ ఏ భావములు గలవో, అవన్నియు కేవల రసపోషకభావమాత్రములుగనే ఎఱుంగనగును.

వాస్తవముగ అన్నియు అఖండప్రేమమయములే. ఈ విషయమంతయు వివరముగఁ దెలిసికొనవలెనన్న శ్రీ ఉజ్జ్వల నీలమణి గ్రంథమందును, జైవధర్మగ్రంథమందును అధికారముగల పాఠకమహాశయులు తిలకించినచో సర్వమును హృదయంగమము కాఁగలదు. అధికారములేని వారలకు అమంగళమొనఁగూడునను సందేహముతో దానిని గుఱించి యీ గ్రంథమున ఇంతకుమించి చెప్పఁదలఁచుకొనలేదు.

మధురరసమందు కృష్ణునియొక్కయు, కృష్ణవల్లభల యొక్కయు గుణములు, నామము, చరితము, మండనము, సంబంధవస్తువులు, తటస్థములగు పదార్థములు ఇవన్నియు

అసురమారణాది లీలయందు వ్యతిరేక రూపముగ కృష్ణతత్త్వము విదితమగుచున్నది. పూతనవధ మొదలుకొని కంసవధ పర్యంతము అసురమారణ లీలయే.

ఈ సమస్త లీలయు, వ్రజమందు వ్యతిరేక రూపముగను, నిర్గుణగోలోక లీలయందు అభిమాన మాత్రస్వరూపముగను, వర్తమాన మగుచున్నది.

అసుర మారణము వస్తుస్వరూపమున గోలోకమందు లేదు ; అట్లుండుటకు అవకాశముకూడ లేదు. వ్యతిరేక లీలాపఠన మొనర్చి రసికులు శుద్ధభావము కలవారై అన్వయలీలారసాస్వాదనము చేయుఁగా చేయుఁగా గోలోక దర్శనము వారలకు లభించును.

ఇచట నింతవఱకే దీనిని గూర్చి సంక్షిప్తముగఁ జెప్పినాఁడను. సాధకులును, ప్రేమారురుక్షువులగు పురుషులును విశేష ప్రయత్నపూర్వకముగ దీనిని తెలిసికొని అనుశీలన మొనర్పనగును. భాగవతమున తృతీయశ్లోక మిట్లున్నది :—

శ్లో॥ నిగమకల్పతరో ర్గళితం ఫలం
శుకముఖా దమృతద్రవ సంయుతం
పిబత భాగవతం రస మాలయం
ముహురహో రసికా భువి భావుకాః

వ్యతిరేకానుశీలనమునందు ఎంతవఱకు ప్రయోజనము కనఁబడుచున్నదో, అంతవఱకు ఈ మహారసమందు మగ్నమగుటకు అవకాశములేదు. వ్యతిరేక అనుశీలనముయొక్క యథార్థ

ఫలము ఉదయించి నంతనే గోలోకమందలి నిర్గుణరసము కూడ ఉదయించుచున్నది.

కాని అంతవఱకు భాగవతరసమును అవలంబించి అన్వయ వ్యతిరేకరూపమగు అనుశీలనము ఒనరించుటయే ప్రయోజనము.

అష్టకాల లీలయందు ప్రవేశించి రసాస్వాదనము చేయుము. మఱియు భౌమవ్రజమందుగల ఇతర లీలను, అనగా, వ్యతిరేక లీలను ఆస్వాదించుచు తన్మూలమున సాక్షాద్రసాస్వాదనమునకు ప్రతికూలములగు విషయములను వినాశన మొనర్పుము. అప్పుడు ఫలకాలమందు నిర్గుణస్థితి కలిగి గోలోకదర్శనమును, ప్రాప్తియు అనాయాసముగ లభించుచున్నవి.



# అష్టమ వృష్టి



## ఉపసంహారము

గ్రంథకర్త యొక్క నివేదనము.

నేను రచించిన ఈచిన్న గ్రంథము విచారగ్రంథమనియే తెలియవలెను. దీనిని ఆస్వాదన గ్రంథముగ భావింపరాదు. ఇదియే ఆస్వాదన గ్రంథమైనచో ఇందు సర్వరసములయందును ఉత్కృష్టరసమగు మధురరసముగూర్చి చెప్పినచోట శ్రీరాధాకృష్ణ లీలావర్ణనము లిఖింపబడియే యుండును. లీలారసాస్వాదనము అనేక గ్రంథములయందు లిఖింపబడియుండెను. అధికము ఏమనిన, అందలి తత్త్వమంతయు కేవలము ఆస్వాదన విషయముగుటచే అది అంతయు ఈ గ్రంథమందు లిఖించుట దుస్సాధము. ఇది కేవల విశుద్ధవిచారణ పరాయణముగు గ్రంథము.

విచారము యొక్క పంచ విధములగు అవయవములు

విచారమునకు ఐదు అంగములు కలవని పండితులు చెప్పుచున్నారు. అవి యేవనిన,

(1) విషయము (2) సంశయము (3) సంగతి (4) పూర్వపక్షము (5) సిద్ధాంతము.

నేను చేయు విచారమునకు విషయమేద్ది? ఈ జిజ్ఞాసకు నేను చెప్పెడి ఉత్తరము ఏమనిన, జీవుని జీవనమే ఈ విచారమునకు విషయము.

సంశయమెయ్యది? ఈ ప్రశ్నకు ఉత్తరము ఏమనిన "జీవన మననేమి? దాని ఉద్దేశమేమి?" అనునదియే సంశయము.

నావిచారమునకు, సంగతి ఎద్దిఅనిన జీవుని జీవనము రెండు విధములు :- (1) శుద్ధజీవనము (2) బద్ధ జీవనము. శుద్ధజీవనము శుద్ధ చిద్ధామమున ఒప్పుచుండును. అది నిత్య పవిత్రమును, ఆనందమయమును అగుచున్నది. ఆ జీవనమందు అభావముగాని, శోకముగాని, భయముగాని, మృత్యువుగాని లేదు.

బద్ధజీవనము ఈ జడజగత్తునందే వర్తమానమగుచుండును. అది కూడ రెండు విధములు. (1) బహిర్ముఖ జీవనము (2) అంతర్ముఖ జీవనము.

బహిర్ముఖ జీవనమందు చిద్ధామముయొక్క తలంపే ఉండదు. దానియందు సాన్ముఖ్యము కూడ లేదు.

అంతర్ముఖ జీవనము బహిర్ముఖ జీవనమువలెనే కనంబడుచున్నను దానియందు చిద్ధామము నెడల సాన్ముఖ్యము కలదు. మఱియు, చిద్ధామమునే ముఖ్యముగ అనుసంధించుటయు కలదు.

బహిర్ముఖ జీవనము నాలుగు విధములు. ఎట్లన,

చతుర్విధ బద్ధజీవనము

(1) నీతి శూన్య నిరీశ్వర బద్ధజీవనము
(2) నైతిక నిరీశ్వర బద్ధజీవనము
(3) నైతిక సేశ్వర బద్ధజీవనము
(4) నిర్విశేష చింతా వికృత జీవనము

(1) నీతిశూన్య నిరీశ్వర బద్ధజీవనము

నీతిశూన్య నిరీశ్వర బద్ధజీవనము.

(a) నరేతర జీవనమనియు (b) నర జీవనమనియు రెండు విధములు.

పశుపక్ష్యాదుల జీవనము నరేతర జీవనము. ఆ జీవనమందు బుద్ధివృత్తి లుప్తప్రాయముగ నుండును.

నీతిబుద్ధిరహిత నరజీవనము మరల రెండు విధములగుచున్నది :—

(a) అత్యంత అసభ్యావస్థకు సంబంధించిన మానవుని ఆదిమ వన్యలక్షణ జీవనమందు పశువురీతిగ మానవుఁడు తన యిచ్ఛవచ్చినట్లు ప్రవర్తించుట మొదటిది.

(b) భయముచేతను, ఆశచేతను ప్రేరేపింపఁబడి సూర్యుఁడు, చంద్రుఁడు మున్నగు కాంతిమంతములగు వస్తువులను ఆ మనుజుఁడు వేలువేలు దేవతలుగ భావించుచున్నాఁడు. ఆ అవస్థయందు నీతియు లేదు; యథార్థమగు ఈశ్వరభావము కూడ లేదు. జీవుని సిద్ధస్వరూపమందు ఇమిడియున్న భక్తివృత్తి బొత్తుగ లోపించియున్నను దాని పరిచయము మాత్రము అప్పుడప్పుడు కలుగుచుండును.

ద్రవ్యజ్ఞానమును, ద్రవ్యశక్తి జ్ఞానమును సంపాదించి యుక్తిచాలనముచే పదార్థవిజ్ఞానము, శిల్పాదుల ఉన్నతియు కలుగుచుండ ఇంద్రియ సుఖములకు దాసుఁడై నీతినిగాని, ఈశ్వరునిగాని ఎవఁడు అంగీకరింపఁడో, అట్టివాఁడు నీతిబుద్ధిరహిత నరజీవనమందలి రెండవ శ్రేణికి చెందినవాఁడగుచున్నాఁడు.

నైతిక నిరీశ్వరబద్ధ జీవనము

(2) తమపరి చెప్పఁబడిన జీవనమందు నీతియెడల ఆదరబుద్ధి ఉండుటచే అది నైతిక నిరీశ్వర బద్ధ జీవనము అగుచున్నది. అదియే రెండవ విధమగు బద్ధజీవనము.

నైతిక సేశ్వర బద్ధ జీవనము

(3) తఱువాతి జీవనమందు ఈశ్వర విశ్వాసము కలిగి యుండుటచేనది నైతిక సేశ్వర బద్ధ జీవనము అగుచున్నది. ఈ జీవనమందు ఈశ్వర ప్రీతిరూప కర్తవ్యకర్మ నీతి కధీనమై యుండుటచే తన్మూలమున బహిర్ముఖత్వము దూరస్థము కాకుండును. ఇదియే మూఁడవ విధమగు బద్ధ జీవనము.

నిర్విశేష చింతా వికృత జీవనము

(4) పై జీవనమందు అత్యంతమగు నిర్విశేషచింత ప్రవేశించినంతనే నీతికి అధీనమైయున్న ఆ జీవనము క్రమక్రమముగ ఆ నిర్విశేష చింతకు అధీనమగుచున్నది. ఈ జీవనమందలి ఈశ్వరవిశ్వాసము కేవలాద్వైత విశ్వాసముగ ఎప్పుడు పరిణామము పొందుచున్నదో, అప్పుడు నిర్విశేష చింతా వికృతమగు బహిర్ముఖజీవనము లక్షితమగుచున్నది. ఇదియే నాలుగవ విధమగు బహిర్ముఖబద్ధ జీవనము.

సాధన భక్తజీవనము

పరమేశ్వరునే జీవన సర్వస్వముగ భావించి విజ్ఞానమును, శిల్పమును, నీతిని, ఈశ్వర వాదమును, ఈశ్వరచింతను, ఈశ్వరభక్తికి అధీనములుగ జేసి ఎవరు తమ జీవనయాత్రను గడపుచున్నారో, అట్టివారి జీవనము బద్ధజీవనమే అయినను అంత

ర్ముఖ జీవనమగుచున్నది. ఈ అంతర్ముఖ జీవనమునకే సాధన భక్తి జీవనమని పేరు.

జడసంబంధము సంపూర్ణముగ నశింపుచుండ, తన స్వధర్మము నిర్మలత్వము నొంది జాజ్వల్యమానమగుచుండ, జీవుఁడు చిద్రసమందు అవస్థితిలాభము నొందుటయే జీవనము యొక్క ముఖ్యోద్దేశము. ఇదియే అంతర్ముఖ జీవనమునకు ఫలము.

ఈ నాసంగతి (Reconciliation) ని విని ముందు జెప్పిన నాలుగు విధములగు బహిర్ముఖ బద్ధజీవనములకు సంబంధించిన కుసంస్కారాపన్నులగు జీవగణము తమతమ నిష్ఠలకు అనురూపములగు పూర్వపక్షముల నొసరింతురు. ఆయా అవస్థలకు చెంది యున్న జీవగణము తమ తమ కోష్ఠములయందుండి యుక్తియొక్క సాయముపొంది విషయ, సంశయ, సంగతి పూర్వపక్షములను లెస్సగ విచారించి ఒక్కొక్క సిద్ధాంతమును చేయుచున్నారు. ఆ సిద్ధాంతము లన్నియు మనకు పూర్వపక్షములే అగుచున్నవి.

ఇందలి కథయేమనఁగా: ఒక జీవుఁడు ఏ జీవనమందుండి పూర్వపక్షమొనరించునో, ఆ జీవనమునకు అవ్యవహితోచ్చమగు జీవనమందున్న జీవుఁడు ఆపూర్వ పక్షమును త్రోసివైచి తన సిద్ధాంతమును తాను స్థిరపఱచుచున్నాఁడు. మన జీవనమునకు అవ్యవహిత నిమ్నస్థమగు ఏ జీవన సమూహము (Non-theistic life) కలదో, ఆ జీవన సమూహము నకు సంబంధించిన సిద్ధాంతములను నిరసించుటే మన కార్య

మగుచున్నది. కావున నేను అట్లే చేయుదును. ఈ నా గ్రంథ మందు అచ్చటచ్చట ఈ సిద్ధాంతములన్నియు ప్రదర్శింపఁ బడినను వానిని సుబోధ మొనరించుటకై వానిని మఱల విమర్శించుచున్నాను.

నీతిశూన్య బహిర్ముఖ జీవుఁడు ఇట్లు యోజించును :-

నీతిశూన్య నిరీశ్వర వాదుల యుక్తి

"ప్రకృతియొక్క అనాదివిధులను అనుసరించి పరమాణువుల సంయోగ వియోగ క్రమముచే ఈ విచిత్రమగు జగత్తు ఉత్పన్నమైనది. దీనికి ఎవఁడును సృష్టికర్త లేఁడు. ఈశ్వర విశ్వాసము మనకుగల కుసంస్కారముచే ఉద్భవించినదే కాని వేఱుకాదు.

పరమేశ్వరుఁడను పేరుగల ఒకానొక మహాచైతన్యము కలదనినచో, ఆ చైతన్యమునకు ఒక సృష్టికర్త అవసరమగుచున్నాఁడు. అందువలన ఈశ్వర విశ్వాసము స్థిరతరము కాఁజాలదు. జడశరీరమందు ఏ జడమయమగు మస్తిష్కము కలదో, దానియొక్క ఘటనా ప్రణాళి ననుసరించి బుద్ధి ఉదయించుచున్నది. ఆ సంఘటనము విడువడి (Disintegrate) నచో మఱి బుద్ధికి అస్తిత్వముండదు.

ఆత్మ యనునది ఒకటి కలదని అనుకొనువారి విశ్వాసము అంధ విశ్వాసమే. శరీరమునకు పతనము కలిగినంతనే అస్తిత్వమునకు అభావము కలుగుచున్నది; లేదా అది మూలతత్త్వమందైన అప్పుడు చేరిపోవుచున్నది. ఈ జీవనమున మరణ పర్యంతము ఎంతవఱకు సుఖములను భోగించు

టకు అవకాశము కలదో, అంతవఱకు సుఖములను భోగించియే తీఱవలెను. కాని ఆ సుఖభోగమందైన ఐహిక భావి - అసుఖములు, అనఁగా తన్మూలమున ముందురాగల ఇహలోక కష్టములు కలుగకుండఁ జూచుకొనినచో అది చాలును.

రాజదండనము, మరణశిక్ష, ప్రాణనష్టము, ఇతరులతో శత్రుత్వము కలుగుట, పీడ, అపకీర్తి, అనునవి ఐహికభావి-అసుఖములు.

దేహసుఖమునకు మించిన సుఖములేనందున దేహసుఖ సంపాదనమే ప్రయోజనీయమగుచున్నది. ఈ సుఖము అభివృద్ధి నొందుటకై శిల్ప, విజ్ఞాన, కారుకర్మములను ఎంతవఱకు వృద్ధిపొందించుటకు అవకాశము కలదో, అంతవఱకు వానిని యుక్తిచేతను, పరిశ్రమముచేతను వృద్ధిపొందింపనగును. ఈ జీవనసంబంధమగు వస్త్రావస్థను దూరస్థమొనర్చి వస్త్రముల యొక్కయు, గృహమందుండు ద్రవ్యముల యొక్కయు, శరీరము యొక్కయు, కాంతినీ, అందమును, మఱియు బాహ్యసభ్యత్వమును వృద్ధిపఱపనగును. మంచి తినుబడి వస్తువులను, సుగంధద్రవ్యములను, సుశ్రావ్యములగు వాద్యయంత్రములను, చూచుటకు ఇంపగు చిత్తరువులను-ముట్టిన సుఖము కలిగించునట్టి హంసతూలికా తల్పములను సంపాదించి సౌఖ్యమనుభవింపనగును. పెద్దపెద్ద మేడలను, నానావిధములగు వాహనములను సంపాదించి సౌందర్య వృద్ధినిగూర్చి వానితో భోగింపనగును.

నైతిక నిర్ణయముల యుక్తి

నైతిక బహిర్ముఖజీవులు అధికతరముగ బుద్ధి ప్రకాశము చూపి నీతి శూన్య బహిర్ముఖ జీవులను శీఘ్రముగ ఓడింతురు వారు ఏమందురనిన,

“సోదరుఁడా! నీవు చెప్పినదంతయు నేను ఒప్పుకొనుచున్నాను. కాని నీ స్వేచ్ఛాప్రవర్తనము మంచిదని నేను అనఁజాలను. నీ జీవనమందు నీవు సుఖాన్వేషణము చేయుచున్నావు కాని, నీతిరహితముగ జీవనసుఖము ఏ విధమున లభింపఁగలదు? నీ జీవనమే సరియగు జీవనమని నీవు తలఁపరాదు. సామాజిక జీవనమే జీవనమగుచున్నది.

సామాజిక జీవనమందు సుఖసమృద్ధి కలిగించుటకు ఏ విధి సమర్థమగుచున్నదో అదియే శ్రేష్ఠమగు విధి. దాని పేరే నీతి. నీతిని అతిక్రమింపకుండ సుఖభోగ మొనర్చుట చేతనే మానవుఁడు పశువుకంటె శ్రేష్ఠుఁడగుచున్నాఁడు. తాను కొన్ని కష్టములను ఓర్చినఁగాని సమాజమునకు సుఖము లభింపని యెడల, తాను ఆ కష్టములను సంతోషపూర్వకముగ స్వీకరించుటయే యుక్తి యుక్తుఁడగు పురుషునకు కర్తవ్యము. దీనినే నిష్కామ నీతి అందురు. ఇది ఒక్కటే మానవ ధర్మము.

సామాజిక సుఖమునకు సమష్టివృద్ధి కలిగించుటకై ప్రేమ, మైత్రి, కృప మున్నగు భావములను అనుశీలన మొనరింపుము. అట్లొనర్చినచో హింస, ద్వేషము మున్నగు దుష్టభావములచే మానవచిత్తము మటి దూషితము కాకుండును.

విశ్వప్రేమమే విశ్వసుఖము. తత్సుఖ సమృద్ధి కలిగించు ఉపాయములనే నీవు అవలంబింపుము.

ఇదియే నిశ్చయవాదు (Positivist) లగు కాంటే (Comte), మిల్ (Mill), అను వారల యొక్కయు, సమాజవాదు (Socialist) లగు హెర్బర్ట్ స్పెన్సర్ (Herbert Spencer) మున్నగు వారలయొక్కయు, మఱియు సాధారణముగ బౌద్ధులందఱియొక్కయు, నాస్తికుల యొక్కయు నిగూఢమగు మతము.

కల్పిత సేశ్వర నైతికుల యుక్తి.

కల్పిత సేశ్వర నైతికులు పైని జెప్పినదంతయు అంగీకరించి తా మిట్లందురు:-

''ఈశ్వర విశ్వాసము ఒక ప్రధానమగు నీతి. ఈశ్వర విశ్వాసము ఎంతవఱకు కలుగకుండునో, అంత వఱకు నీతి అసంపూర్ణముగనే ఉండును. పరమేశ్వర విశ్వాసముచే కొంత నైతికోపకారము (Moral good) కలుగు ననుట స్పష్టమగు విషయము.

(1) నీతిబుద్ధి ప్రబలముగ నున్నను పెద్దపెద్ద నీతిజ్ఞులకు కూడ ఇంద్రియవిషయాకర్షణము బలీయమే అగుచుండును. ఎవ్వరైనఁ దాము అనుకొనకుండనే విషయములచే ఆకర్షింపఁబడినప్పుడు ఈశ్వర విశ్వాసమొక్కటే వారిని అట్టి ఆకర్షణము నుండి మఱలింపఁజాలినదై యుండును. మనుష్యుని కంటికి అగపడనిదంతయు పరమేశ్వరునికి మాత్రము విశదమే అను

నమ్మకము ఎవరి మనమందుండునో అట్టివారలు అతి రహస్యముగనైన నీతి విరుద్ధములగు కార్యము లొనర్చుటకు సమర్థులై యుండరు.

(2) ఈశ్వర విశ్వాసము కలిగినచో అట్టి విశ్వాసముచే కలుగు సుఖమువలన మరణ సమయమందు కలుగు కష్టము చాలవఱకు నివారణమగును.

(3) సాధారణముగ నీతిబుద్ధికంటె ఈశ్వరవిశ్వాసము అధికతరమగు ఐహిక పుణ్యప్రవృత్తి జనకమనుచు అందఱు అంగీకరించిన విషయమే.

(4) కేవల నీతిజ్ఞులగు వారల జీవనమందు కంటె ఈశ్వర విశ్వాసమయ జీవనమందు అధికశాంతి కలుగును.

(5) ఈశ్వరుఁడు వాస్తవముగఁ గలఁడేని వానియందు విశ్వాసము కలిగియుండుటచే చాల లాభము కలదు. ఒకవేళ ఈశ్వరుఁడు లేకపోవుటయే నిజమైనచో వానియందు విశ్వాసము కలిగి యున్నంత మాత్రమున ఎట్టి నష్టమును లేదు. ఈశ్వరుఁడున్నచో విశ్వాస రహితులగు వారలకు గొప్ప నష్టము కలిగియే తీఱును కదా? కావున యథార్థ నీతిజ్ఞులకు ఈశ్వర విశ్వాసమే కర్తవ్యము.

(6) ఈశ్వరోపాసనమందు సుఖము కలదు. ఆ సుఖము సదోషములగు ఇతర సుఖములకంటె నిర్మలమైనది. ఈశ్వర సుఖమందు ఉత్పాతవిషయము లేదు. ఇతరము-

లగు అన్ని సుఖములయందును విషయోత్పాతము కలదు.

(7) ఈశ్వర విశ్వాసముచే చిత్తవృత్తులన్నియు సన్మార్గ ప్రవర్తకములగుచు ఎంతటి పుష్టిలాభము నొందునో, అంతటి పుష్టిలాభము ఇతర నీతులచే కలుగదు.

(8) ఈశ్వరవిశ్వాసము కలిగినచో దయాగుణము, క్షమాగుణము బలవత్తరము లగును.

(9) ఈశ్వరవిశ్వాసము కలిగినచో నిష్కామకర్మము అధిక ఉత్సాహముతో నిర్వర్తింపఁబడును.

(10) ఈశ్వర విశ్వాసము కలిగెనేని పరలోకబుద్ధి ఉదయించును. పరలోకబుద్ధి ఉదయించినచో ఎట్టిసమయమందును, ఏ విధముచేతను నిరాశ అనునది మఱి కలుగనేరదు.

ఓయి సోదరుఁడా! ఈశ్వరుఁడనువాఁడు లేకపోయినను పైనిఁజెప్పిన కారణములచేతగాని, మఱి యే కారణముచేతఁగాని ఈశ్వరు నొకనిని అంగీకరించుటయే ఉచితము."

ఈ సమస్త ప్రత్యక్షఫలములచేతను నిరీశ్వరవ్యక్తి కల్పితసేశ్వర వ్యక్తియెదుట పరాజితుఁడగుచున్నాఁడు.

అపుడు కాష్టేవలె అతఁడు కల్పితమగు ఒక ఉపాసనాతత్త్వమును అంగీకరించి తీరును.

జైమినియొక్క కర్మకాండకును, పతంజలియొక్క ఈశ్వర ప్రణిధానమునకును, కాష్టేయొక్క కల్పితోపాస

నముననును కొన్ని కొన్ని విషయములలో ఒకింత భేదము కనుపించుచున్నను వీనికన్నిటికిని ఫలము ఒక్కటియే. కాణ్వే తన మనస్సులోని భావమును దాఁచకుండ చెప్పినాఁడు. జైమిని మున్నగు కర్మవాది గణము అతనికంటె జాగరూకు లగుటచే తమభావమును కప్పిపుచ్చి అట్లేయుంచిరి.

వాస్తవ సేశ్వర నైతికుల యుక్తి

కల్పిత సేశ్వరవాదము ప్రబలమగుచుండ వాస్తవ సేశ్వర వాదము తర్క యుద్ధమునకు సహజముగ ముందంజ వేయును. వాస్తవ సేశ్వరవాది యిట్లనును :—

"సోదరుఁడా! ఈశ్వరుఁడు కల్పిత తత్త్వమని చెప్పుట తగదు. అతఁడు యథార్థముగ ఉన్నాఁడు. నేను ఇప్పుడు చెప్పఁబోవు రహస్యోక్తులను చక్కగ విమర్శించి చూడుము.

1. జగత్తునందలి నియమముయొక్క పారిపాట్యమును (Beauty of arrangement) తిలకించినచో ఒక విభుచైతన్యము చేతనే ఈజగత్తు సృష్టింపఁబడి దాని యందే యిది వ్యవస్థాపితమై యున్నదని చెప్పుటలో ఎట్టి సందేహములేదు. మానవునియొక్కయుక్తిశక్తి (Power of reasoning) అన్నివృత్తులకంటె శ్రేష్ఠమైనది గనుక అది యుక్తముగ నుపయోగింపఁబడినచో సత్యము స్పష్టీభూతమగును.

ఒక్కొక్కయెడ సూక్ష్మతను పరిత్యజించినచో భ్రాంతియే ఉదయించును. యుక్తి కార్యమందు

వ్యాప్తియొక్క విశేషప్రయోజనము (Necessity of seeing things from all points of view) కలదు. అట్లు కానిచో యుక్తి చాలినంతదూరము పోఁజాలదు.

ఏ రెండు పక్షములను అవలంబించుటచే సాధ్యవిషయము నిర్ణయింపఁబడుచున్నదో, ఆ రెండు పక్షములును మొదట శుద్ధములై యుండవలెను. ఎట్లన, పర్వతమందు అగ్నియుండుట ధూమదర్శనముచేతనే అనుమానింపఁబడుచున్నది. పొగ ఎచ్చటనుండునో, అగ్ని అచట నుండునని శుద్ధపక్షమై ఉండక తీఱదు.

రెండవపక్షమెద్దియనిన, ఏ ధూమము చూడఁబడుచున్నదో, అది వాస్తవ ధూమమై ఉండవలెనుగాని, పొగ మంచు మున్నగువానివంటిది కాఁగూడదు.

ఇట్లు రెండుపక్షములును శుద్ధములైనచో సాధ్యవిషయము, అనఁగా, పర్వతమందు అగ్నికలదను విషయము అవశ్యముగ సత్యవిషయమే అగుచున్నది. యుక్తిగతానుమానము (Inferential reasoning) నకు ఇదియే ప్రధాన ప్రక్రియ.

జగద్వ్యాపారమునందు కననగు సొగసుందనమును, సుషుసన్నివేశము (Proper arrangement) ను ప్రథమ పక్షముగ అంగీకరించినపుడు ఘటనాక్రమమున (By accident) ఏవేవి కలుగుచున్నవో వానియందు సౌష్ఠవము లేకుండుననియే అన్యపక్షముగూర్చి చెప్పవలసియుండును. కేవల విచారణపూర్ణమగు ఒక చైతన్యము

సృష్టికర్త యైనప్పుడే ఇంతటి సౌష్ఠవము గోచరింపఁ గలదు. కావున ఒకానొక బృహచ్చైతన్యము చేతనే ఈ జగత్తు నిర్మింపఁబడినదని ఈ రెండు పక్షముల మూలమున స్థిరపడుచున్నది.

2. కర్తలేకుండ ఎట్టి కర్మయు చేయఁబడదు. కర్తకు మఱి యొక కర్త ఉండవలెననిన చో దీనికి సదుత్తరము ఎద్ది యనిన, జడీయ కర్తలకు మాత్రమే కర్తలుండుట ప్రయోజనీయమగుచున్నది.

బుద్ధి శక్తిచే ఆకారము మొదట కల్పింపఁబడు చున్నది. వెనుక, ఆ ఆకారము కార్యముగ పరిణమించి నపుడు అది ఒకానొక జడీయ వ్యాపారమగుచున్నది.

చైతన్య లక్షణముగల వస్తువే జడమునకు ఆదికర్త. కాని ఆ బుద్ధికి కర్త యగునది ఎద్దియో మనకు గోచరింప నప్పుడు చైతన్య వస్తువునకు కర్త ఉండవలెనని నీ కెవరు చెప్పిరి ?

జడదృష్టి మూలమున నీకు ఏ కుసంస్కారము గలి గెనో, దానిని బట్టి నీవు అక్రమముగ చైతన్య కర్తను అన్వేషించుచున్నావు. ఆ కుసంస్కారమును విడిచి విశుద్ధ యుక్తి నవలంబించి పరమేశ్వరునియందు విశ్వాస ముంచుము.

3. పరమాణువులయొక్క విశేష సంయోగక్రమముచే చైత న్యము ఉత్పత్తి అయ్యెనేని, అట్టి ఉత్పత్తిని గూర్చిన

ఒక్కొక్క ఉదాహరణమైనను ఏ దేశపు ఇతిహాసమందైనను లిఖింపఁబడి యుండవలెను కదా ?

మాతృ గర్భమందే మానవునికి ఉత్పత్తి కలుగుచున్నది. అట్టి ఉత్పత్తి వేఱువిధముగ గలుగుట ఎచ్చటను చూడలేదు. వేయి సంవత్సరములనుండి విజ్ఞానము వృష్టిలాభము నొందుచున్నను అదికూడ ఇందు విషయమై ఎట్టి ఉపాయమును కనుఁగొనఁజాలదయ్యెను.

ఘటనాక్రమమున ఒకానొక సమయమందు మానవుఁడు ఉద్భవించెననియు, తదుపరి మాతృగర్భ జన్మరూపమగు పద్ధతి అవలంబింపఁబడెననియు, అందువేని దానికి ఉత్తరము ఇచ్చుచున్నాను:—

అదే నిజమైనచో ప్రథమ ఘటనవలె మఱియొక ఘటనకూడ కలిగియే ఉండవలెను. ఇప్పుడుకూడ ఒకరిద్దఱు స్వయంభువులు ఉదయించుట మనకు గోచరించియే ఉండవలెను. కావున ఆదిమాతాపితలసృష్టి ఆ విభుచైతన్యముచేఁ దప్ప వేఱొక విధముగ అయ్యెననియుక్తిచేత స్థిరపఱచుటకు అవకాశము లేదు.

4. మానవుఁడు ఎచట నుండునో, అచటనే ఈశ్వర విశ్వాసముండును. ఈశ్వర విశ్వాసము మానవ ప్రకృతిసత్వమునకు సంబంధించిన నిష్ఠాధర్మము.

ప్రాథమికావస్థనుండున్న జాతులయందు వారికి గల మూర్ఖతకు ఫలముగ ఈశ్వర విశ్వాస ముండెననియు,

తదుపరి అది యుక్తిక్రమమున దూరీభూతమయ్యెననియు, అనినచో దానికి ఉత్తరము ఇచ్చుచున్నాను :—

భ్రమ (Fallacy) అనునది అన్నిచోట్లను ఒకే విధముగ ఉండదు. సత్యముమాత్రము సర్వత్ర ఒకే విధముగ ఉండును. ఎట్లన, పదియు, పదియు కలిపినచో ఇరువది అగును. ఇట్లగుట అన్ని దేశముల యందును కలదు. ఏమన ఇది సత్యవిషయము.

పదియు, పదియు కలిపిన ఇరువదియైదు అగుననెడి మిథ్యాఫలము సార్వత్రికము కాజాలదు. దూర ద్వీపములయందు నివసించెడి వారిలోకూడ ఈశ్వర విశ్వాసము కలదు. కుసంస్కార శిక్షాక్రమముచే ఈశ్వర విశ్వాసము వ్యాపించెనని వాదించినచో అందువలని ప్రయోజనము లేదు.

5. మానవ జీవితమందు ఉచ్చస్థితి నొందుటను గూర్చిన వాసన కలిగినచో ఈశ్వర విశ్వాసమును, పరలోక విశ్వాసమును కలిగియుండుట మిక్కిలి అవశ్యకము.

కొద్ది దినములకే సమాప్తి నొందెడి జీవనమునకు సంబంధించిన ఆశలును, ఆలోచనలును ఎన్నటికిని దృఢతరములు కాజాలవు. మానవప్రకృతికి ఈశ్వర విశ్వాసము స్వాభావసిద్ధ ధర్మమగుటచే మానవుని ఆశలును, ఆశయములును అత్యున్నత లక్ష్యము కలవియే అగుచున్నవి. ఈశ్వర విశ్వాసములేని మానవ ప్రకృతి

విజ్ఞానము, శిల్పము, నీతి, ఈశ్వరజ్ఞానము అనువాని అనుశీలన మొనర్చుటయే నీకు కర్తవ్యము. ఆ అనుశీలనము (1) అవైధాను శీలనమనియు, (2) వైధాను శీలనమనియు రెండు విధములు.

అధికార విచారము చేయకుండ అసమయమందును, అయోగ్యరూపముగను ఏ అనుశీలనము చేయఁబడుచున్నదో, అదియే అవైధానుశీలనము.

ఏ మనుజునకు ఏ అనుశీలనమునందు ఎంతటి యోగ్యత కలదో, అంతమాత్రమగు అనుశీలనమే అతఁడొనర్చుట మేలు. అంతటికి అధికముగఁగాని, అల్పముగఁగాని ఒనర్చినచో మంచి ఫలము కలుగఁజోదు. మనుజుని యోగ్యత అతని స్వభావము ననుసరించియే కలుగుచున్నది. స్వభావమును, ప్రాథమిక స్థితియు (Habit and start of life) శిక్షణము చేతను, సంగ్రమము వలనను ఉదయించుచున్నవి.

ఓ సోదరుఁడా ! స్వభావ విచారపూర్వకమగు ఏ వర్ణాశ్రమ రూప వైజ్ఞానిక ధర్మము భారతదేశమున ప్రవర్తితమగుచున్నదో, దానిని నీవు అవలంబించినచో, నీ అధికారమునకు అంతటికిని అనురూపమగు కార్యమును, ఉత్కృష్ట ఫలమును నీకు కలుగుచున్నవి.

మఱియొకమాట వినుము. నీబుద్ధి యుక్తి చేతను, నీఆత్మసత్తాగతమగు విశ్వాసముచేతను, నీ ఆత్మను నీవు మరణరహితమైనదానిగఁ దెలిసికొనుము. అట్లయినచో నీవైధ జీవనము సర్వాంగసుందరము కాఁగలదు. తల్లి గర్భమునే

పుట్టిన నాఁటినుండియు నీఆత్మసత్వము (Soul's Existence) నీకు అనుభవనీయముగ నున్నను, నీ దివ్యయుక్తి మూలమున దానిని మఱికొన్ని ఉన్నత భావములతో అలంకరింపుము.

ఈ జన్మకు పూర్వము నే నుంటిని. ఈ జన్మమునకు పరమందుకూడ నేనుందువాఁడను.

అనునట్టి సిద్ధాంతమే లేకున్నచో ఈశ్వర విశ్వాసము పవిత్రము కాఁజాలదు.

ఇది వినుము. ఒకానొకఁడు సాధువుల గృహమందు జన్మించుటచే వానికి సాధుత్వగ్రహణము సహజముగ లభించు చున్నది. ఒకానొకఁడు అసాధువుల యిండ్లలో జన్మించుటచే వానికి అసాధు స్వభావము కలుగుటకు అనేకములగు అవకాశములు కలవు. వానికి లభించెడి శిక్షయు, సంగమును వాని యెడల అనుకూలమగుటయో, ప్రతికూలమగుటయో సంభవించుచున్నది. వాని బుద్ధికి ఎప్పుడు పక్వావస్థ కలుగుచున్నదో, అపుడు వాని స్వభావము స్థిరమైపోవుచున్నది. దాని ననుసరించి చేసిన పనులకు ఒక్క జీవన (జన్మ) మందే అనంతఫలము ఒసంగఁబడినచో, ఒకనికి అగత్యముగ స్వర్గమును, మఱియొకనికి అగత్యముగ నరకమును లభించియే తీఱును.

సర్వశక్తిమంతుడును, పరమ దయాళువును, సర్వవిచార సంపన్నుఁడును అగు ఈశ్వరునకు ఇది ఉచితమగు కార్యమెన్నఁటికైన నగునా ?

ఏ క్షుద్రమతములందు ఏక జీవన గతమగు కర్మ మాత్రమే స్వీకరింపఁబడుచున్నదో, ఆ మతములన్నియును మిక్కిలి అసంపూర్ణములును, అయుక్తములును అగుచున్నవి. నీవు అట్టి మతములయందు ఆబద్ధుఁడవుగాక ఉన్నతభావ సంపన్నుఁడవగుచు వర్ణాశ్రమధర్మము నవలంబింపుము. అపుడు నీకు యథార్థమగు సుఖము లభింపఁగలదు.

కర్మయే ప్రధానకర్తవ్యము. (1) సకామము (2) నిష్కామము అనుచు కర్మ రెండు విధములు.

సకామకర్మము కేవలము ఇంద్రియపోషకమే అగును గాన దానియందు నీకు రుచికలుగుట ఉచితముకాదు. నిష్కామకర్మకే కర్తవ్యానుష్ఠానమని పేరు. కర్తవ్యానుష్ఠానమందు ఇంద్రియసుఖము ఉన్నను, లేకపోయినను అది కామము మాత్రముకాదు. స్వార్థపరత్వమునకే కామమని పేరు. కర్తవ్యమనుచు చేయఁబడిన కర్మయందు కామముండదు. కర్తవ్యానుష్ఠానము చేతనే హరితోషణము సిద్ధించుచున్నది. హరి సంతుష్టుఁడయ్యెనేని భుక్తిముక్తులు రెండును లభింపఁగలవు".

సంబంధ జ్ఞానాలోచనారంభము.

ఈ విధముగ విచారము సలిపి సేశ్వరనైతికులు వర్ణాశ్రమ ధర్మమును సంస్థాపనము చేసి దానిని ఆశ్రయించియే తమ జీవయాత్ర గడపుదురు. జీవనోద్దేశమును ఉత్తమరూపమున నిర్ణయించుటకే వారు సదా ప్రయత్నించుచుందురు.

అప్పుడు జీవునకును, ఈశ్వరునకును గల సహజ సంబంధము ఎయ్యది అను విచారము ఆరంభమగును. ఈ అవస్థయే సేశ్వర నైతికుని యొక్క నూతన జీవనము.

" అనేక విషయములను నేను సిద్ధాంతీకరించినను నా మూలతత్త్వము గూర్చి మాత్రము నేను ఎట్టి సిద్ధాంతము చేసియుండలేదు " అనెడి విషయము అతనికి తోఁచి నంతనే కొన్ని కొన్ని ప్రశ్నలు అతనికి ఉదయించును.

"నే నెవఁడను ? జగత్తుతో నాకు గల సంబంధ మేమి ? ఈశ్వరునితో నాకు గల సంబంధ మేమి ? చివరకు నాకు కలిగెడి గతి యేమి ? " అనెడి సంశయములనుగూర్చి అతఁడు లెస్సగ విచారము సలుపుటచే మూఁడు విధములగు సంగతులు బయలువెడలుచున్నవి. అవి ఎవ్వి యనిన,

(1) స్వసుఖప్రయోజక కర్మసంగతి
(2) స్వార్థ వినాశరూప నిర్విశేషజ్ఞాన సంగతి
(3) శుద్ధ స్వధర్మాలోచన రూప భక్తి సంగతి

(1) మొదటి సంగతి ననుసరించి సేశ్వర నైతికుఁడు ఇట్లనును :—

"నేను క్షుద్ర జీవుఁడను, ధర్మాధర్మములకు వశీభూతుఁడను. సర్వదా సుఖములనే కోరువాఁడను. జగత్తుతో నాకు భోగ్యభోక్తృ సంబంధమే కలదు. నేను భోక్తను. జగత్తు భోగ్యము. ఈ బ్రహ్మాండమునందు ఏదో ఒక భాగమున నిర్మల భోగ పీఠ స్వరూపము (A seat of unmixed

enjoyment) కలదు. నేను అచటికి పోయి నిర్మల సుఖమును భోగింతును

ఈశ్వరునితో నాకు గల సంబంధము ఎద్ది అనిన, ఈశ్వరుఁడు సృష్టికర్త; నేను సృష్టపదార్థమును. ఈశ్వరుఁడు దాత; నేను గృహీతను. ఈశ్వరుఁడు పాలించువాఁడు; నేను పాలింపఁబడువాఁడను. ఈశ్వరుఁడు రక్షకుఁడు; నేను రక్షితుఁడను. ఈశ్వరుఁడు శక్తిమంతుఁడు; నేను దుర్బలుఁడను. ఈశ్వరుఁడు లయకర్త; నేను లయమునొందు స్వభావముకలవాఁడను. ఈశ్వరుఁడు విధించువాఁడు; నేను సర్వవిధులకు అధీనుఁడను. ఈశ్వరుఁడు విచారించువాఁడు; నేను విచారింపఁబడుటకు పాత్రుఁడను.

ఈశ్వరుఁడు ప్రసన్నుఁడైనచో నాకు దుఃఖహానియు, సుఖప్రాప్తికి యోగ్యమగు స్థానము లభించుటయు కలుగును.

అధ్యాత్మయోగముకూడ సూక్ష్మాంశమున ఈసంగతి యందు అంతర్గతముగ నుండును. అష్టాంగయోగలభ్యమగు అధ్యాత్మసమాధి దానికి ఉదాహరణమగుచున్నది. యమ నియ మానస ప్రాణాయామ ధ్యానధారణలు కర్మాంగములు. ప్రత్యాహారము తత్సమాధి ఫలమునకు వలయు చేష్ట. సమాధియే దుఃఖహాని రూపమును, సుఖవ్యాప్తి రూపమును అగు చరమఫలము.

(2) రెండవ సంగతి ననుసరించి సేశ్వరనైతికుఁడు కర్మత్యాగి యగుచు నిర్విశేషచింతయందు ఆరూఢుఁడగును. అపుడు అతఁడు ఇట్లనును :—

"నేను జ్ఞానమయ వస్తువును. బ్రహ్మకూడ జ్ఞానమయుఁడే. నేను వాని అంశవిశేషమే. జడముతో నాకుఁగల సంబంధమే నా దుర్గతికి కారణము.

జడమునకు సాక్షాద్విపరీతమగు పదార్థమే బ్రహ్మ. బ్రహ్మ స్వరూపుఁడనగు నేను భ్రాంతివశుఁడనై జీవోపాధి నొందితిని. బ్రహ్మకంటె వేఱగు పదార్థములేదు. ఇపుడు నేను ఏ జగత్తును చూచుచున్నానో, అది నాఅవిద్యచే కల్పించఁబడినదే. 'నేను బ్రహ్మను' అనెడి నిశ్చయ జ్ఞానము ఉదయించి నప్పుడే నాకు నిర్వాణరూపమగు లాభము కలుగుచున్నది. నిర్వాణమే నాజీవనమునకు చరమోద్దేశము"

మూఁడవ సంగతి ననుసరించి సేశ్వర నైతికుఁడు ఇట్లనును :—

"నేను వాస్తవముగ చిత్పదార్థమునే కాని నేను అణుచైతన్యుఁడను. భగవంతుఁడు బృహచ్చైతన్యుఁడు.

జడజగత్తు మిథ్యకాదు. జడజగత్తునందు నాకుగల అహంకారము నాజ్ఞాన దౌర్బల్యమునకు సంబంధించినది.

నేను నిత్యభగవద్దాసుఁడను. జడజగత్తుతో నాకుగల సంబంధము అనిత్యమైనది. ఈ సంబంధము భగవదిచ్ఛచేత నాకు కలిగినది. నాకుగల భగవద్వైముఖ్యము ఎంతవఱకు తగ్గునో అంతవఱకు నాజడసంబంధము శిథిలమై నా చిత్సంబంధము ప్రబలమగుచుండును. నా సత్వమందు భగవద్దాస్యరూపమగు ఏవృత్తిగలదో, అదియే నా స్వధర్మము. ఆ స్వా

ధర్మముయొక్క అనుశీలనము చేయఁగా చేయఁగా అవాం-
తర ఫలస్వరూపమగు జడ ముక్తికలుగును. మఱియు నిత్యఫల
స్వరూపమగు ప్రేమలాభముకూడ కలుగును. భగవంతునితో
నాకుగల సంబంధము నిత్యసేవ్యసేవక సంబంధము."

కర్మఠులు.

ప్రథమ సంగతికి సంబంధించినవారు బద్ధులే అగు చున్నారు. వారలు కర్మకే ప్రధానత్వమిడి భగవంతుని గూడ ఒక కర్మాంగముగనే భావింతురు. వారికి గలిగెడి ఫలము నిత్యలక్షణముతోఁ గూడుకొన్నదికాదు. వారల సంగతి దోష రహితముకాదు. వారల జీవనమందు భగవదిచ్ఛకు లోబడిన విషయమే లేదు. సర్వము విధికి అధీనమై యుండును. వీరికి కర్మఠులని పేరు.

జ్ఞానకాండకు సంబంధించినవారు.

ద్వితీయ సంగతిచే ఆ బద్ధులైన వారు ఆత్మనాశమునే ఉద్దేశించి ఫల్గువైరాగ్యమును ఆచరించుచున్నారు. వారలకు ఈ జగత్తునందు ప్రతిష్ఠయు లేదు; వారు సిద్ధ సత్త్వమగుటయు లేదు.

కొందఱు వ్యతిరేక చింత నవలంబించి తమ జీవితము నంతను వ్యర్థము చేయుచున్నారు. వీరలే జ్ఞానకాండకు సంబంధించినవారు.

కర్మఠులు చేయు పూర్వపక్షము.

ప్రథమ సంగతికి సంబంధించినవారు తృతీయ సంగతికి అనుగతులగు వారల జీవనమును ఈ విధముగఁబూర్వపక్ష మొనరింతురు:—

"భక్తి నాశ్రయించి నీవు ఈ జగత్తునందుగల సకల వస్తువులను, తద్వస్తుగతములగు సుఖములను తుచ్ఛము లను చున్నావు మాకు అభీష్టఫల ప్రదములగుచు మా సుఖముల కొఱకు అగుచున్న భోగపీఠ రూపములగు ఏ స్వర్గాదులు కలవో వానిని కూడ నీవు హేయము లనుచు సిద్ధాంతీకరించు చున్నావు.

బ్రహ్మాది స్థావరపర్యంతమగు ఏ సృష్టికలదో దాని యందు నీకుఁగల వైరాగ్యముచే నీవు జగదున్నతి కొఱకు ఏమియు ఒనర్పవు సరేకదా ఈ రీతిగ జగత్తును నాశనమొన రించుచున్నావు.

మాకు ఈ జగత్తు కర్మక్షేత్రము. ఇచ్చట పరమేశ్వ రునికి ప్రియములగు కార్యముల నొనర్చుచు మేము ఇహపర సుఖములను రెండును సాధించుచున్నాము. నీవు వానిని గోలు పోవుటయే కాక ఇతరుల సుఖములనుకూడ పాడుచేయు చున్నావు."

భక్తుల ప్రత్యుత్తరము

ఈ పూర్వపక్షమునకు క్రింద వివరించిన సిద్ధాంతరూప మగు ప్రత్యుత్తరము భక్తమండలము నుండి పంపఁబడుచున్నది :—

"సోదరుఁడా ! ఈ జగత్తునకు ఉన్నతి కలిగించినంత మాత్రమున జీవునకు విశేషలాభము లేకుండుట నిజము. అయి నను భక్తుల జీవనమును నీవు పరీక్షించి చూచినచో ఈ జగత్తు నందు చేయఁబడు ఏ మాత్రపు మంగళసాధనమైనను కేవలము భక్తుల వలననే కలుగుచున్నదని స్పష్టపడఁగలదు.

విజ్ఞానమును, శిల్పమును, కారుకర్మమును, నీతిని నీవు ఎంతటి ఉన్నత స్థితికి తేఁగలుగుదువో అంతవఱకు తెమ్ము. అందువలన మాకు ఎట్టి విరోధము కలుగదు. సరేకదా తన్మూలమున భక్త్యనుశీలనమునకు అనేకములగు అనుకూలములు ఏర్పడుచున్నవి.

మేము విరాగులము కాము అనురాగులము. కాని మేము చెప్పునది వినుము. సమస్తకర్మలును భగవదున్ముఖతతో స్వీకరింపఁబడుగాక! కర్మలన్నిఁటికి అవాంతరఫలమగు ఏ స్వార్థ సుఖము కలదో, తన్మూలమున ఏకర్మలును ప్రేరితములు కాకుండునుగాక! భగవద్భక్తికి ఉన్నతలాభము కలుగవలయునన్నెడి ఉద్దేశముతోడనే కర్మలు ఆచరింపఁబడునుగాక!

కార్యసంబంధమున నీ జీవనమునకును, నా జీవనమునకును కొంచెమైనను భేదములేదు. కర్మతులకు, భక్తులకు గల భేదమెచ్చట? భేదము ఎచ్చట ఉన్నదనిన కర్తవ్యబుద్ధితో నీవు కార్యాచరణ మొనరింతువు. భగవద్దాస్యభావ మిళితముగ నేను కార్యాచరణ మొనరింతును. ఏదేనొక సమయమందు నాకుగల విరక్తిచే నా కర్మాచరణము కుంఠితము కావచ్చును. అది నీవు ఏదేనొక అవస్థయందు కర్మలనుండి విరమించుటతో సమానము చేయుదువు. కాని నీవు నిరర్థకముగ కర్మలనుండి విరమింతువు. నేను భగవద్భక్తి క్రమమున అవసరమును బట్టి విరమింతును.

జగత్తు నీకు కర్మక్షేత్రమగుచున్నది. నాకు భక్తిసాధన క్షేత్రమగుచున్నది. నీవు ఆచరించు సమస్త కర్మలును నేను బహిర్ముఖ కర్మలనియే చెప్పుదును. ఏమన, నీవు

(3) ఏ కర్మ చేయక తీరదో దానియందు శ్రీకృష్ణభక్తిని చేర్చి ఆచరింపుటయు; ఏ కర్మ చేయకున్నచో దేహయాత్రా నిర్వాహకమునకు అవరోధము కలుగదో, ఆ కర్మను విడుచుటయును.

తాపసుల యొక్కయు, యోగుల యొక్కయు చేష్టలు.

(1) మొదటి ఉపాయమును అవలంబించువారు తాపసులును, యోగులును అగుచున్నారు. తాపసులు అనేక కష్టములను సహించి కర్మ గ్రంథిని ఛేదింపవలసి యుండును. వైదిక పంచాగ్ని విద్యయు, నిదిధ్యాసమును వైదిక యోగ తాపసుల ప్రక్రియలు.

అష్టాంగ యోగము, షడంగ యోగము, దత్తాత్రేయ యోగము, గోరక్షనాథ యోగము మున్నగు అనేక విధములగు యోగములు చెప్పఁబడుచున్నవి.

వీనిలో తంత్రశాస్త్రమందు చెప్పఁబడిన హఠయోగమును, పతంజలిచే చెప్పఁబడిన రాజయోగమును లోకమునందు విశేషాదరణీయములుగ నున్నవి. పాతంజల దర్శనమందు అష్టాంగయోగము సర్వప్రధానమగుచున్నది. ఈ యోగముయొక్క తాత్పర్యము క్రింద వివరింపఁబడుచున్నది :—

"కర్మబద్ధుఁడగు జీవుఁడు ప్రారంభమందు అహింసా సత్యాఽస్తేయ బ్రహ్మచర్యాఽపరిగ్రహ రూపమగు పంచవిధ యమము నభ్యసింపనగును: మఱియు, శౌచము, సంతో

షము, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వర ప్రణిధానము అనెడి అయిదు విధములగు నియమమును అభ్యసింపనగును.

ఇట్లొనర్చుటచే అసత్కర్మ పరిత్యాగమును, సత్కర్మాభ్యాసమును సిద్ధించుచుండ, ఆసనాభ్యాసమును, తదుపరి ప్రాణాయామాభ్యాసమును చేసి, పవన జయము సాధింపనగును. పవనజయము సిద్ధించుచుండ విష్ణుమూర్తి ధ్యానమును, తదుపరి ధారణయు చేయనగును. సమస్తవిషయ నివృత్తి రూపమగు ప్రత్యాహారము ధ్యానమునకు పూర్వమే సాధింపనగును. ఈరీతిగ చిత్తము నిశ్చలత్వము నొందుచుండ సమాధిలాభము కలుగును.

ఈ ప్రక్రియ కంతకును మూలతాత్పర్యమేమనిన, అభ్యాస క్రమమున కర్మలు విడువఁబడుచుండ తుదకు కర్మ రాహిత్యము నొందుటయే. కాని అందు విలంబనమును, వ్యాఘాతమును కూడ కలుగుచుండును.

బహిర్ముఖ చిత్తమందు విష్ణుప్రీతి కామసంకల్పము అసంభవము

(2) రెండవ ఉపాయమును అవలంబించువారు ఇట్లు యోజింతురు :—

"చిత్తము ఏ విషయమందు అనురక్తమై యుండునో, దానిని గూర్చిన ఆలోచనము మొదట విష్ణుప్రీతిగను, కడపట కృష్ణార్పణముగను చేయుటయే కర్తవ్యము. కాని యిది స్వభావ విరుద్ధమగు కార్యము. విషయరాగముచే ప్రేరేపింపఁబడిన చిత్తము ఏ స్వభావము ననుసరించి విష్ణుప్రీతి సంకల్ప మొనర్పఁగలదు? లోకక్షేమము కొఱకు ఈసంకల్పము చేయఁబడినదనినచో ఇది చిత్తముయొక్క స్వాంతకార్యమని

చెప్పుటకు వలనుపడదు. ఇట్లనుటచే ఆత్మవంచనమే కలుగు చున్నది.

రాబోవు జన్మమందు సమృద్ధిగ అన్నము లభింప వలయునను ఆశతో స్త్రీలుచేయు అన్నపూర్ణా పూజనమందు విష్ణుప్రీతి సంకల్పమొనర్చుట కేవల వాచిక విషయమే.

ఇట్టి సంకల్పవిధులును, అర్పణవిధులును జీవుని కర్మ బంధమునుండి విముక్తుని చేయఁజాలవు. ఇందునుగూర్చి చెప్పినచో గ్రంథ బాహుళ్యమగును.

అంతర్ముఖ జీవనము.

(౩) మూఁడవ ఉపాయమే యుక్తమైనది. ఏమన, చిత్తము ఏ విషయమందు రాగము కలిగి యుండునో, దానికి అనుకూలము గనే కార్యము నిర్వహింపఁబడుచున్నది. చిత్తము మంచి తినుబడి వస్తువులను అభిలషించినచో అవి భగవత్ప్రసాద రూపమున గ్రహింపఁబడినచో భగవద్భావ సంబంధమగు అనుశీలనమును, విషయరాగమును ఏక కాలమందే నిర్వ హింపఁబడుచున్నవి. ఈరీతిగ ఉచ్చరసాస్వాదనము నిర్వ ర్తింపఁ బడుచుండ అత్యల్పకాలములో నీచరాగము దాని యందు అణఁగిపోవును. ఇదియే గౌణభక్తి. దీనిచే కర్మ త్రోసివేయఁబడుచున్నది. చూచుటకు కర్మ కనఁబడుచున్నను దాని సత్వము లోపించుట సహజముగ సంభవించుచున్నది.

శారీరకములును, మానసికములును అగు సమస్త కర్మలు ఈ ప్రవృత్తి ననుసరించి చేయఁబడినచో కర్మ గౌణభక్తి రూపము వహించి దాసి అగుచు అన్నివిధముల చేతను ముఖ్యభక్తికి పరిచర్య యొనర్చును.

సేశ్వర నైతికులయందు ఎవరికి ఇట్టి ప్రవృత్తి ప్రబలమై యుండునో, వాని జీవనమే అంతర్ముఖ జీవనమగుచున్నది. తక్కిన సేశ్వర నైతికుల జీవనము కేవల బహిర్ముఖ జీవనమే.

భక్తియే జీవుని పరమ పురుషార్థము.

ఈ విధముగ సమస్త పూర్వపక్షములు త్రోసివేయఁబడి జీవునిచే ఏకమాత్ర అనుష్ఠేయమగు భక్తియే సిద్ధాంత విషయముగ ఇచట ప్రదర్శింపఁబడుచున్నది. భక్తియే జీవునికి పరమ పురుషార్థము. జగదున్నతి సాధనమునకును, జగన్మంగళ సాధనమునకును ఇది అవిరోధమగుటయే కాక, శాంతిని, నిర్మలానందమును జీవునికి కలిగించి, జీవుని నిత్యత్వమును స్థాపించుచున్నది.

భక్తజీవనమే యథార్థనరజీవనము. ఇదియే సంపూర్ణ మంగళమయ జీవనమగుచున్నది. ఈ జగత్తునందు భక్త జీవనమొక్కటియే వైకుంఠతత్త్వ మగుచున్నది.

ప్రేమ జీవనము

భక్తజీవనమందు సాధన భక్త్యనుశీలన మొనరించి, తదుపరి భావ జీవనమును అతిక్రమించి, ప్రేమ జీవనమందు ఎపుడు జీవుఁడుపదార్పణము చేయుచున్నాఁడో, అప్పుడు సకల మాధుర్యమునకు, సమస్త ఐశ్వర్యమునకు ప్రభువును, భగవంతుఁడును అగు శ్రీనివాసుఁడు తన పరమరస భండారమును తెఱచి జీవునిఁ బిలిచి యిట్లనుచున్నాఁడు :—

"మిత్రుఁడా ! ఈ భండారమును ప్రయత్న పూర్వకముగ నీకొఱకు నేను దాఁచియుంచితిని. నీకు ఒక్కనికే

దీనియందు అధికారము కలదు. నీవు నన్నువిడిచిపెట్టి నా మాయాశక్తియొక్క తంత్రములలో చిక్కువడినాఁడవు. నీకొఱకు నేను అనుదినమును పాటుపడుచున్నాఁడను. నీ స్వప్రయత్నముచే నీవు ఇంతవఱకు రాఁగలిగినందులకు నేను పరమానందము పొందుచున్నాను.

నీవు నాయొక్క నిత్యనూతనప్రీతిమయ విగ్రహమును సదా సేవించుచు అపారమగు ఆనంద సముద్రమందు నాతోఁ గూడ క్రీడింపుము. నీకు భయములేదు. శోకములేదు. ఏమన, నీవు అమృతత్వలాభమును పొందితివి.

నన్నుఁ జేఱవలెనని నీవు సమస్తబంధములను త్రెంచుకొంటివి. నీకు నాయందుగల ప్రేమ అనెడి ఋణమును నేను ఎన్నఁటికిని తీర్చఁజాలను. నీకర్తవ్యమును నీవు ఆచరించితివి గనుక నీవిఁక సంతుష్టుఁడవు కమ్ము.''

శ్రీ చైతన్యశిక్షామృతమును విడిచి ఎవఁడు అన్య శిక్షను గ్రహించునో, అట్టివానిని గూర్చి భాగవత పంచమ స్కంధమునందలి పంచమాధ్యాయమున ఋషభదేవుఁడు ఈ క్రింద వివరించిన ఉపదేశమును అనుగ్రహించెను. సోదరుఁడా ! ప్రయత్నపూర్వకముగ దానిని శిరసావహింపుము..

శ్లో॥ గురుర్న సస్యాత్, స్వజనో న సస్యాత్
పితాన సస్యాత్, జననీ న సా స్యాత్
దైవం న తత్స్యాత్, నపతిశ్చ సస్యాత్
నమోచయేద్య స్సముపేత మృత్యుమ్.

శ్రీకృష్ణచైతన్యార్పణమస్తు.

★